అర్థాలు - అంతరార్థాలు - 2

# దేవాలయములపై బూతుబొమ్మలా?

—————————— శ్రీ శివ చిదానంద భారతీస్వామి

దేవాలయములు హైందవ సంస్కృతి విభవమునకు ప్రతీకలు. దేవాలయ ప్రాంగణములు ఋజువర్తనకు స్ఫూర్తి కేంద్రములు. ఆ దేవాలయ గర్భాలయములో ప్రతిష్ఠింపబడిన ఆయా దేవతామూర్తులు ఆయా ఆరాధకులకు సర్వరక్షకులు. మానవుడు నిజ జీవితములో ఎటుల ప్రవర్తించినప్పటికీ, దేవాలయ ప్రాంగణములో ప్రవేశించుటకు ముందు బహిఃశుద్ధి చేసుకుని, శుభ్రవస్త్రధారియై, అంతఃశ్శుద్ధి కొరకు తాను అప్పటివరకు చేసిన పాపకర్మలను తుడిచి పెట్టి, సత్ప్రవర్తనకు అనుగ్రహముకోరుచు అంతరంగ శుద్ధుడై, దేవాలయ ప్రాంగణములో ప్రణమిల్లి తృప్త మనస్కుడై బయటకు వచ్చుచున్నాడు. తరువాత జీవనములో మంచి, చెడులను విశ్లేషించుకొని దుష్టమార్గమును విడనాడి, సత్ప్రవర్తనతో శేషజీవితమును నడుప ప్రవర్తనా నియమావళిని నిర్దేశించుకొనుచున్నాడు. అంతటి పవిత్ర మైన స్థలములో దేవాలయ ఉపరితలముపై నికృష్టమైన లైంగిక విన్యాసములతో బూతుబొమ్మలెందుకు నిర్మించ వలసి వచ్చినదో తన బుద్ధికి అవగాహన గాక పవిత్రమైన దేవాలయముపై ఏహ్యమైన బొమ్మలు నిర్మించినందుకు పూర్వులను నిందించుచు, లైంగిక వక్రబుద్ధి (Sex - Perversity) గా నిందించుచున్నారు దానిలోని గర్భిత సందేశము సక్రమముగా అవగాహన అయినచో అట్టి నిర్మాణములు గావించినవారికి సహస్రాధిక పాదాభివందనములు చేయవలసినదే. ఈ జాతి మనుగడకు సృష్టి నిరంతరము జరగవలసినదే నిరంతరము జరగవలసి యున్నందున విశృంఖలత్వము పనికిరాదు సృష్టి విషయములో లైంగికక్రియ అపవిత్రము కారాదు అందువలన దేవాలయ గర్భాలయములో ప్రతిష్ఠింపబడిన దేవతామూర్తి పూజ ఎంత నియమబద్ధముగాను, క్రమబద్ధముగాను జరగవలెనో సృష్టి విషయములో కూడా దేవతారాధనగా భావించి, పవిత్ర ముగా క్రియచేయవలెను. సృష్టియొక్క పవిత్రత పూజనీయత లైంగిక క్రియయొక్క పవిత్రపై ఆధారపడియున్నది. లైంగిక క్రియ విషయములో జరుగు శీలపతనము సృష్టికి చ్యుతి. అట్టి మహోన్నతమైన సందేశం మానవాళికి అందించుట కొరకై దేవాలయ నిర్మాణ ములో అట్టి బొమ్మల నిర్మాణము అర్థవంతముగా చేయబడినది దేవాలయము కన్న మించిన పవిత్రస్థలమే లేదు. అటులనే సృష్టికి మించిన పవిత్రకార్యము ఇంకొకటి లేదు. అందువలన రెండింటియొక్క ఉనికి ఒకే ప్రాంగణములో లోపల, బయట ప్రతిష్ఠింపబడినని

---

శ్రీవాణిని పోషించండి ! మంచిని పెంచండి ! పదిమందికి పంచండి !

---

జూన్ 1995

సంపుటి : 11

సంచిక : 6






మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం - 521 001

ఫోన్ : 22818

| | |
|---|---|
| విడి ప్రతి | : రు. 4-50 |
| సంవత్సర చందా | : రు. 54-00 |
| 4 సం॥ల చందా | : రు. 200-00 |
| జీవిత సభ్యత్వం | : రు. 600-00 |
| పోషకులు | : రు.1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM
Phone : **21137**

espatched on 7-6-1995


# విషయసూచిక



ముఖచిత్రం : మహాకవి ఉళ్ళూర్



# సత్ప్రవర్తన, సదాలోచన, సద్గుణాలకు నిలయం అలనాటి రామరాజ్యం

భగవాన్ సాయి దివ్య సందేశం

ప్రేమస్వరూపులారా !

భగవంతునకు ప్రపంచంలోని సమస్త పదార్థములూ సమానములే. కారణం ? ప్రపంచమే తన స్వరూపం. భగవత్ స్వరూపమైన ఈ ప్రకృతిని 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్నారు. కనుక పరమాత్మను ప్రేమించేటటువంటి ప్రతి వ్యక్తీ ప్రకృతిని కూడా ఆరాధించాలి, ప్రేమించాలి, విశ్వసించాలి. ప్రకృతి వేరు పరమాత్మ వేరు కాదు. ప్రకృతి కార్యము, పరమాత్మ కారణము, కార్యకారణస్వరూపమే ఈ ప్రకృతి

మంచితనమునకు మారుపేరు దైవము. కనుక భగవంతుని గుణగణములను చింతించి స్మరించినప్పుడే మానవత్వం సార్థకమవుతుంది భగవంతుని పలుకులు, చర్యలు, సంకల్పములు నిరంతరమూ నిర్మలమైనటువంటివి, నిశ్చలమైనటువంటివి, నిస్వార్థమైనటువంటివి. ఒకసారి శ్రీరాముడు మిథిలకు వెళ్ళుతూ మధ్యలో గౌతముని ఆశ్రమంలోనున్న ఒక బ్రాతిపై ఆసీనుడైనాడు. తక్షణమే ఆ బ్రాతి నుండి ఒక స్త్రీ ఉద్భవించింది కాని శ్రీరాముడు నా పాదము సోకిన వెంటనే బ్రాతి నాతిగా మారిపోయినదని గ్రహించలేదు, ఆనందించక పోగా "అయ్యో ! ఋషిపత్నికి నా పాదము సోకినదే ! ఎంత పొరపాటు" అని విచారించాడు. మరో పర్యాయం శ్రీరాముడు హనుమంతునితో "హనుమంతా ! నీవు చేసిన సహాయమునకు నీకు నేనేమి ప్రతిఫలము యివ్వగలను ? కృతజ్ఞత చెప్పడం తప్ప ప్రతిఫలమును అందించలేను. అయితే ఒకటి చేయగలను, నీవు ఎప్పుడు నన్ను స్మరిస్తే, అప్పుడు నీకు దర్శనమిస్తాను" అన్నాడు. అనగా ఎవరితో మనం ఉపకారమును పొందుదుమో, ఎవరిచేత సహాయమును అందుకొందుమో, అట్టివారికి జీవితమంతా కృతజ్ఞత చూపడం మానవుని ప్రధానమైన కర్తవ్యం పారమార్థికదృష్టితో ప్రకృతిని మనం అనుభవించడానికి ప్రయత్నించాలి. కాని ఈనాటి మానవుడు ప్రాకృతదృష్టితో పరమాత్మను ఆరాధించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇది చాలా తప్పు. ప్రాకృత దృష్టిని మరచి పరమాత్మ దృష్టిని ఎరుకలోనికి తీసుకోవాలి.

దేహము నీటి బుడగవంటిది అయితే ఇట్టి అనిత్యమైనటువంటి దేహమే, నిత్యసత్యమైనటువంటియొక్క స్వరూపాన్ని నిరూపింపజేస్తుంది. ప్రతి పలుకు, ప్రతి చేష్ట, ప్రతి తలపు భగవంతునిదిగా ఉండాలి మానవత్వమునకు తగినటువంటి నిదర్శనం పరిపాలన ఏ విధంగా చేయాలి ? మానవుని శీలసంపదను ఏవిధంగా పోషించుకోవాలి ? అనే విషయాలను సత్య స్వరూపంగా నిరూపించినవాడు శ్రీరామచంద్రుడు ఉత్తమ చర్యలు, ఆదర్శవంతమైన గుణాలు పవిత్రమైన ఆలోచనలు - ఈ మూడింటియొక్క స్వరూపమే శీలమునకు పునాది. ఈ మూడింటి సమ్మిళిత స్వరూపమే రామస్వరూపము,

సంకల్పములు, చర్యలు, గుణములు – ఈ మూడింటి యొక్క ఏకత్వము ప్రతి మానవునికిని అత్యవసరం. ఇలాంటి సత్యమును ప్రబోధించి, ప్రచారంచేసి, అనుభవించి, ఆ న ం ది ం చి, అందించినటువంటివాడు రాముడు "సత్యం వద" "ధర్మంచర" సత్యమునే పలికేటటువంటివాడు. ధర్మమునే ఆచరించే టటువంటివాడు ఇతరులను నొప్పించక ప్రియమైన వాక్కులచేత సంతృప్తిపరచేటటువంటివాడు. ఎదుటివ్యక్తి ఎంతటి కఠినమైన మాటలు మాట్లాడినప్పటికనీ, శాంతముతో, సహనముతో, చిరునవ్వుతో స్వీకరించేటటువంటివాడు పరుల విషయంలో ప్రవేశించక, పరుల దోషములను చూడక, పరుల పరిహసించక, పరులను నొప్పించేటటువంటివాడుకాదు కనుక ప్రతి మానవుడు రామచర్యలను ఆశించడం, అనుసరించడం అత్యవసరం ప్రతి వ్యక్తి ఇటువంటి పవిత్రమైన గుణములను పోషించుకోవాలి, అభివృద్ధి పరచుకోవాలి.

ఈనాడు మానవుడు అధికారమును చేజిక్కించుకోవటానికి అనేకమందిని బాధించి, అపమార్గములలో ప్రవేశించి, అనేక అక్రమ చర్యలకు పాల్పడుతున్నారు కాని శ్రీరామచంద్రుడు చే జి క్కి న అధికారమును త్యజించి, పితృవాక్య పరిపాలన నిమిత్తమై కానలకేగి కష్టాలననుభవించాడు ఆడిన మాట తప్పకూడదని ఆదర్శవంతమైన జీవితమును లోకమునకు అందించాడు. హక్కులను విసర్జించాడు, అధికారమును త్యజించాడు, అడవులపాలయ్యాడు, కష్టములు, దుఃఖములు, విచారములు ప్రధానము కాదని నిరూపించాడు. సత్యము యొక్క విలువను గుర్తించడానికి ప్రయత్నించాలని ప్రబోధించాడు.

ఆడిన మాట తప్పరాదు. ఎట్టి పరిస్థితులందైననూ తనను తాను కోల్పోవచ్చును గాని, మాటను మాత్రం కోల్పోరాదు కాని ఈనాటి మానవులు మాత్రం క్షణ క్షణం మాటలు మారుస్తున్నారు. అడుగడుగునా అబద్ధాలు ఆడుతున్నాడు, వాగ్దానాలు విస్మరిస్తున్నారు ఇలాంటి మానవత్వము లోపల రామతత్త్వం ఏ రీతిగా ఆవిర్భవిస్తుంది ? రామునియొక్క ఆశయములు, ఆదర్శములు, చర్యలు ఆచరణలో పెట్టినటువంటి మానవత్వమునకే అత్యంత సమీపస్థుడైవుంటాడు భగవంతుడు. కనుక మాట తప్పనివాడు రాముడు, మాట తప్పేటటువంటివాడు మానవుడు.

హృదయ పరివర్తన లేకుండా ఎన్ని సాధనలు చేసి ఏమి ప్రయోజనం ? మానవుడు కేవలం శరీరధారికాదు, ఆత్మస్వరూపుడు. ఇట్టి ఆత్మతత్త్వమును గుర్తించినప్పుడే ఆధ్యాత్మికము పంట పడుతుంది. ఈ పాంచభౌతిక దేహమే సర్వస్వమని భావించి కాలమును వృథా చేసుకున్నాం ఈ శరీరము దేవ మందిరం. కనుకనే "దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవస్సనాతనః" ఈ దేహమనేటటువంటి దేవాలయంలో సనాతనుడైన దేవుడు ఆత్మస్వరూపుడై ఉంటున్నాడు.

ఈనాడు అనేకమంది అధికారాల కోసమో, పదవుల కోసమో, పేరుప్రతిష్ఠల కోసమో ఎంతో పాటుపడుతున్నారుకాని, దానిలో అణుమాత్రమైనా దైవానుగ్రహం కోసం మాత్రం పాటుపడటంలేదు. తులసీదాసు చెప్పాడు. "నాకు చేతులున్నాయి, కాళ్లున్నాయి, కండ్లున్నాయి– అన్నీ ఉన్నాయి అయినప్పటికీ ఓ రామా ! నేను అంగహీనుడను" అన్నాడు దీని అంతరార్థమేమిటి ? చేతులుండి ప్రయోజనం ఏమిటి ? నీ సేవ చేయలేకపోతున్నాను కాబట్టి నేను అంగహీనుడనే. కన్నులుండి ఏమి ప్రయోజనం ? నిన్ను కన్నులారా దర్శించలేకపోతున్నాను. కనుక నిన్ను సేవించనటువంటి అంగములు ఉండి కూడా నిరుపయోగములే నన్నాడు తులసీదాస్. కన్నులుండి ప్రయోజనమేమిటి ? కేవలం ప్రకృతిని మాత్రమే ఆకర్షిస్తున్నాయిగాని, పరమాత్మను ఆకర్షించడంలేదు. ఈ ప్రాకృతమైన దృష్టి వుండినంతవరకునూ, పరమాత్మతత్వం మనకు

( తరువాయి 33 వ పేజీలో )

శ్లో॥ చైత్రేసూత్రిత యౌవనా, స్స్యుపవనా, న్యామోదిని పద్మినీ
జ్యోత్స్నాప్రావరణాని, రత్నవలభీహర్మ్యాణ్యహో, రమ్యాఃస్త్రియః
సర్వంచారుతరం, నకస్యదయితం? యస్మింస్తు తద్భుజ్యతే
తస్మాన్నిర్మిత మామభాజనమివ క్షిప్రక్షయం జీవితమ్

# అమృతవాణి

మాచిభట్ల చంద్రశేఖరశర్మ

జీవితం కొందరికి వడ్డించిన విస్తరి అంటారు, అంటే వాళ్లు ఆజన్మ శ్రీమంతులని భావం. అలాంటివాళ్ళకు లేమి తెలీదు లేమివల్ల కలిగే బాధలు తెలీవు భోగాలతో ప్రారంభమైంది వాళ్ళ జన్మ దారిద్ర్యబాధలు వాళ్ళకేం తెలుస్తాయి చెప్పండి

నిజం మాట్లాడితే జీవితంఎవరికి యిష్టంకాదు? దరిద్రుడికీ యిష్టమే, ధనవంతుడికీ యిష్టమే బాధలనుభవిస్తున్నామని సామాన్యంగా ఏ దరిద్రుడూ ప్రాణాలు వదలటానికి ప్రయత్నించడు అన్నింటికంటే జీవితం తియ్యనిది కదా! అయితే ఒక్క పరమార్థం గ్రహించాలి. జీవితం ఎంత వడ్డించిన విస్తరి అని అనుకున్నా దానికి అంతమనేది వున్నదని తెల్సుకోవాలి భోగాలనుభవిస్తున్నప్పుడు ఆ మత్తులో అనిపించదు. అదే గమ్మత్తు కొస్త సత్తువ వుడిగి వార్ధక్యపుచాయలు పొటమరిస్తూంటే మెల్లగా తెలుస్తుంది.

వసంత ఋతువు వచ్చింది అన్ని చెట్లు, చేమలు చక్కగా చిగిర్చి పూలతో కళకళలాడుతూంటాయి ఉద్యానవనలక్ష్మి నవయౌవనంతో కళ్లు జిగేల్మనేటట్లు కనపడుతుంది అంటే చైత్రమాసం వనలక్ష్మికి యౌవనదశన్నమాట సరస్సుల్లోని పద్మలతలువిప్పారిన పుష్పాలతో సుగంధాలు చిమ్ముతుంటాయి. రత్నాల మేడల పై భాగాల్లో నిండువెన్నెలకాంతులు పరచుకొంటే ఆ మేడల అందచందాలు వర్ణింపనలవి కావు. వసంత లక్ష్మి సింగారించుకొని తన అందచందాలను ఇలా ప్రపంచమంతా ఆరబోసి రసికహృదయాల్లో కమనీయమైన ఊహలు కలిగిస్తుంది. ఇది ప్రకృతి లక్షణం.

చూచేవాళ్ళకు ఈ ప్రకృతి తన నవయౌవనంతో మనోహరంగా గోచరిస్తుంది. స్త్రీలు కూడా ఈ సమయంలో వివిధాలంకారాలతో వినూత్న వస్త్రధారణతో రంగురంగులపూలు తురుముకొని సువాసనీలమైనపూతలు పూసికొని ముస్తాబయి ఎంతో అందంగా కనబడతారు ఇదంతా వసంత ఋతు ప్రభావమనక తప్పదు. ఇవన్నీ చూస్తూ పురుషపుంగవులు ఊహల పల్లకీల్లో వూరేగుతుంటారు, ఇదీ వరస

దీన్ని యిష్టపడని వారెవరైనా వుంటారా? వుండరు ప్రతి ఒక్కరికీ ఇది యిష్టమే ఇదంతా ఈ జీవితంలోనేగా హాయిగా అనుభవిస్తున్నాం. బాగానే వుంది. ఒక్కసారి ఆలోచించండి, అన్నిరకాల అనుభవాలను చూరగొంటున్న ఈ గొప్ప జీవితం ఎంతకాలముంటుందంటారు?

ఈ జీవితం పచ్చికుండ అని తెలుసుకోండి. ఈ పచ్చి మట్టికుండ ఏ క్షణాన విచ్చిపోతుందో తెలీదు. అది విచ్చిపోతే ఈ భోగాలన్నీ ఈ అందచందాలన్నీ యేమౌతాయి? కనుక ఈ భోగాలన్నీ క్షణికసుఖాల్ని చ్చేవేకాని శాశ్వత సుఖం కలిగిస్తాయని పొరపాటున కూడా అనుకోవద్దు.

ఆమభాజనమివక్షి ప్రక్షయం జీవితమ్.

)-C-(

# మలయాళ సాహిత్యంలో ధృవతార

# మహాకవి ఉళ్ళూర్

భరద్వాజ్

మలయాళ సాహిత్యంలో మహాకవిత్రయం ఆవిర్భవించడంలో అపూర్వమైన నూతన వికాసం గోచరించింది. వారే కుమారన్ ఆశాన్, వళ్ళత్తోళ్ నారాయణ మేనోన్, ఉళ్ళూర్ పరమేశ్వర అయ్యరులు ఉపాధ్యాయుడుగా మొదట జీవితం ఆరంభించిన ఉళ్ళూర్ చిట్టచివరికి తిరువాన్కూర్ ప్రభుత్వంలో దివాన్ - పేష్కార్‌గాను (ఆక్టింగ్), ప్రధాన కార్యదర్శిగాను, (ఆక్టింగ్) లాండ్ రెవిన్యూ కమీషనర్‌గానూ పనిచేశారు. 1937 సం లో తిరువాన్కూర్ మహారాజావారు ఆయనకు 'మహాకవి' బిరుదును దానం చేశారు

' ప్రభుత్వోద్యోగి అయినా, ఛీఫ్ సెక్రటరీ స్థాయి నందుకున్నా, ఆయన హృదయం ఎప్పుడూ సాహిత్య రంగానికే అంకితమైంది మహనీయులైనవారు ఒక విషయాన్ని తమ ఆశయంగా ఎంచుకుంటే, ఎన్నడూ దానిని అశ్రద్ధచేయరు ' అని అంటారు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు డా॥ సర్వేపల్లి చేత 'మహా విద్వాంసుడూ, మహాకవి ' అని స్మరించబడిన ఉళ్ళూర్ కేవలం 'శబ్ద వ్యాపారి' (Man of Letters) కాదు ఆయన కార్యదక్షుడు ( Man of Action ) ఆయన ఘనత ఆయన పాండిత్యంలో ప్రతిబింబిస్తుంది. పండితుడుగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, వచన రచయితగా ఉళ్ళూర్ సాధించిన, శిఖరాయమానమైన రచన "కేరళ సాహిత్య చరిత్రమ్" అని చెప్పుకోవచ్చును ఈ గ్రంథంలో 64 అధ్యాయాలు గల మూడు వేల పేజీలు గల గ్రంథం ఇది ఐదు సంపుటాలుగా వెలువడింది. ఈ గ్రంథ రచనకు అవసరమైన సమాచార సేకరణకు ఉళ్ళూరు 30 సం॥ ల పాటు శ్రమించారు. ఎవరి సహాయం లేకుండా ఈ గ్రంథమును వ్రాయటాని 12 సం॥ లు ఆయనకు పట్టింది ఆయన వ్యాధిగ్రస్తులై ఉన్న సమయంలో ఆ గ్రంథం చివరి భాగం పూర్తి చేశారు పరమపదించడానికి మూడు రోజులు ముందు ఆయన ఆ గ్రంథం యొక్క ఆఖరి వాక్యం పూర్తి చేసారుట వారి మరణానంతరం ఆ గ్రంథమును ప్రచురించడానికి కేరళ విశ్వవిద్యాలయంవారు నాలుగు సంవత్సరాలు శ్రమింపవలసివచ్చిందట. పరిమాణం లోను, ప్రామాణికతలోను, ప్రావీణ్యతలోను, సమగ్రత లోను మలయాళ వచన రచనల కన్నిటికినీ ఆ గ్రంథం తలమానికం ఈ గ్రంథంలో మైలురాళ్లుగా కనిపించే ప్రముఖ, ప్రాచీన కవులందరిని గురించి సవివరంగా, సమగ్రంగా, సవిమర్శకంగా చర్చించబడింది. 500మంది పైగా గ్రంథకర్తలను గురించి, 3000 పైచిలుకు గ్రంథములను గురించి ఈ గ్రంథంలో ఆయన వివరించారు. ఈ సాహిత్య చరిత్ర గ్రంథం, అంతకు పూర్వం వచ్చిన చరిత్ర గ్రంథములన్నింటినీ మరుగున పడేట్లు చేసిందనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

' సాహిత్య చరిత్ర ప్రయోజనం ఏమిటి ? సాధారణ పాఠకుడు సాహిత్యాన్ని ఆస్వాదించడానికి తోడ్పడాలి. లేకపోతే అది బూడిదలో పోసిన పన్నీరే ' అన్నాడు జార్జ్ శాంప్సన్. ఉళ్ళూర్ రచనలు ఈ ప్రయోజనాన్ని అద్భుతంగా సాధిస్తున్నాయి ఆయన రచనలో ధారాశుద్ధి ఉన్నది శైలిసరళం "కేరళ సాహిత్య చరిత్రమ్" పాండిత్యానికి శిఖరం, వచనంలో పరాకాష్ఠ, విమర్శనలో మహోన్నత శృంగం అంతేకాదు శైలిలో మిల్టన్

శైలిలోని ఆర్గన్ సంగీతాన్నీ, "శుద్ధ - మద్దళిక" వాద్యాన్ని తలపించజేస్తుందంటారు ఒక మహా సంగీత విద్వాంసుడు.

ఉళ్ళూర్ పాండిత్యములోనే కాక వక్తృత్వంలో కూడా దిట్ట. మలయాళ భాషలో వక్తగా ఆయనకు ఎవరూ సాటిలేరని, దీటుకారని పేరు తెచ్చుకున్నాడు. కవి అయినవాడు తప్పనిసరిగా విమర్శకుడు కూడా అయి వుండాలని నిరూపించుకున్నాడు ఆయన విమర్శనా వ్యాసాలు మొత్తం 66, 'విజ్ఞాన దీపిక' అనే నాలుగు సంపుటాలుగా వెలువడినాయి.

ఆయన పాఠశాలలో చదువుకునే రోజులలోనే ఆయన ప్రతిభను వ్యక్తం చేసిన సంఘటనలెన్నో జరిగాయి నాల్గవతరగతి చదువుతూండగా, ఒక క్లిష్టమైన మలయాళ పద్యంలో పడిన అచ్చు తప్పు ఆయన టీచరు దృష్టికి తెచ్చి ఆశ్చర్యపరిచాడు. ఒక మలయాళ పత్రికలో పడిన క్లిష్టమైన సమస్యని (సమస్యాపూరణం లాంటిది) అందరికీ దిగ్భ్రాంతి కలిగించే విధంగా పూరించి మలయాళము బోధించే టీచర్ల ప్రశంసల నందుకున్నాడు. కాలేజీ విద్యార్థిగా ఉండగానే తిరువనంతపురం పబ్లిక్ లైబ్రరీలో ఉన్న పుస్తకాలన్నీ ఇంచుమించూ అన్నీ చదివాడుట. చదువుతూ ముఖ్యమైన విషయాలను తన నోట్ పుస్తకంలో వ్రాసుకునేవాడుట తదనంతరం ఆయన సాగించిన పరిశోధనాకృషిలో ఆ నోటుపుస్తకాలు ఎంతగానో ఉపయోగపడినాయని వారే చెప్పుకున్నారు.

ఉళ్ళూర్ పాల్గొనిన సామూహిక కవితా పోటీలలో వ్రాయబడిన పద్యాలు "కదన కౌముది" "భాషా పోషిణి" వంటి సాహిత్య పత్రికలలో ప్రచురించ బడుతూ వుండేవి. ఉళ్ళూర్ పాండిత్యం సామాన్య మైనది కాదు సంస్కృత కావ్యాలలోను, శాస్త్రాల లోను ఇంచుమించు సాటిలేని పాండిత్యం ఆయనది. సాంప్రదాయక కవితా మార్గంలో సుశిక్షితుడైన వ్యక్తి ఆయన అంతేకాదు సాహిత్యంలో నవ్య ధోరణులపట్ల సులువుగా ఆకర్షించబడే లక్షణం, దేశం అంతటా వీస్తున్న సరిక్రొత్త గాలులకు సునాయాసంగా అలవాటు పడిపోగల స్వభావం ఆయనది. దీనికి నిదర్శనం ఆయన వ్రాసిన "నేర్చు" అనే కావ్యం. మలయాళ కవిత్వంలో ఏమాత్రం సంస్కృత పదాలను వాడకుండా, కేవలం దేశ పదాలతోనే కావ్య రచన చేయాలనే, ఆనాటి ఫ్యాషన్‌కి, అభిరుచికి అనుగుణంగా చేసిన రచన అది. సంస్కృతంలో చెప్పుకోతగ్గ పండితుడై ఉండి కూడా, సంస్కృతేతర పదాలతోనే కావ్యం వ్రాసే ప్రయత్నం చేయడం, ఆ రోజులలో ఆయన చేసిన ఒక మహా ప్రయత్నం మరో విశేషమేమంటే ఉళ్ళూర్ రచించిన చెప్పుకోదగ్గ మొదటి కావ్యం "ఉమాకేరళమ్" సంస్కృత సంప్రదాయ పద్ధతిలో, వివిధ సంస్కృత ఛందస్సుల్లో కూర్చిన 2,022 పద్యాలు గల 19 సర్గల మహా కావ్యం అది. ఉళ్ళూర్ పరమేశ్వర అయ్యర్

# తెర తీయగరాదా !

ఒకసారి ఒక మహా భక్తుడు శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించే నిమిత్తం తన శిష్యులతో తిరుమల కెళ్ళాడు.

ఆ సమయానికి దేవుని విగ్రహం కనబడకుండా ఒక తెర అడ్డుగా కట్టబడివుంది. దర్శనమునకు సమయం దాటిపోయింది కాబట్టి కొంత సొమ్ము చెల్లిస్తే ప్రత్యేక దర్శనం చేయవచ్చునని అర్చకులు చెప్పారు.

కావి భిక్షాటనము చేసుకుని జీవించే ఆ భక్తుని వద్ద ధనం లేదు.

అప్పుడు ఆ భక్తుడు తనకు దర్శనం కాకపోవడానికి కారణం తనపై స్వామికి కరుణ లేకపోవుటయే అని అది తను చేసుకున్న పాపమేనని అనుకున్నాడు

వెంటనే తంబుర మీటుతూ, ' తెర తీయగరాదా ! తిరుపతి వేంకట రమణా ! .... ' అని గానం చెయ్యడం ప్రారంభించాడు. అక్కడి జనులందరు వచ్చి ఆ గానాన్ని విని పరవశులైపోయారు.

ఇంతలో ఆశ్చర్యకరంగా స్వామివారి ముందు వున్న తెర దానంతట అదే తొలగిపోయింది. రెట్టించిన ఉత్సాహంతో, భక్తిపారవశ్యంతో ఆ భక్తుడు మరికొన్ని పాటలు పాడాడు.

ఆ వింతని చూసి అతని భక్తికి మెచ్చి అందరు ఆశ్చర్యపడి అతనికి నమస్కారాలు చేశారు అర్చకులు అతనిని క్షమించమని వేడుకున్నారు.

ఆ మహా భక్తుడు ఎవరో కాదు సంగీత విద్వాంసులకు తలమానికమైన శ్రీ త్యాగరాజు. భగవంతుడు భక్తులకు వశుడు అనడానికి ఇంతకంటె ఏ నిదర్శనం కావాలి ?

**- ఎస్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి**

సంస్కృతంలోను. ఇటు మలయాళంలోను ప్రముఖ కవిగా పేరు తెచ్చుకున్నారు.

ఉళ్ళూర్ తిరువాన్కూరులో 'పేరున్న' గ్రామంలో 1877 సం॥ జూన్ 6 వ తేదీన జన్మించారు ఆయన తండ్రి సుబ్రమణ్య అయ్యర్ వీరు తమిళ బ్రాహ్మణులు అయితే వీరి కుటుంబీకులు కొన్ని శతాబ్దముల క్రిందటనే కేరళకు వలసవెళ్ళారు వారి పూర్వీకులు తిరువనంతపురానిరి ఉత్తరంగా 4 మైళ్ళ దూరంలోనున్న ఉళ్ళూరు గ్రామంలో స్థిరపడ్డారు. తిరువాన్కూరు రాజవంశం వారు ఈ బ్రాహ్మణ కుటుంబమునకు ఉళ్లూర్ గ్రామమును అగ్రిహారంగా ఇచ్చారుట అందువలన ఆయన తాను జన్మించిన "పేరున్న" గ్రామాన్ని కాకుండా తన పూర్వీకులు స్థిరపడిన ఊరినే అభిమానంతో ' ఉళ్ళూర్ ' ను తన కలం పేరుగా స్వీకరించాడుట, ఆయన అసలు పేరు "సాంబశివన్" ఎలాగో క్రమంగా ఆ పేరు మరుగున పడి "పరమేశ్వరన్" అనే ముద్దు పేరు ఆయనకు ఖాయం అయింది. వారు అయ్యర్ తమిళ బ్రాహ్మణులు కాబట్టి "అయ్యర్" చివర వచ్చింది. ఆయన పూర్తి పేరు 'ఉళ్ళూర్ పరమేశ్వర అయ్యర్ ' గా ఖాయమైంది. పేరులో ఏమున్నది పెన్నిధి, ఆయన పలుకే బంగారం ఆయన కలంలో నుంచి వచ్చింది కవిత్వం. మలయాళ సాహిత్య లోకంలో ధృవతారలా వెలుగొందాడు, మహా కవిగా పేరుగాంచాడు ఆయన చేసిన సాహితీ సేవకు నీరాజనాలర్పిద్దాం ○

# శ్రీ సత్యసాయిబాబావారి దైవతేజస్సు

డా॥ ఫ్రేంక్ జి. బరనౌస్కి

( అనువాదము : యస్. బి. యస్. రామారావు )

(డా॥ ఫ్రేంకు జి బరనౌస్కి 'అరిజోనా' యూనివర్శిటీలో ప్రొఫెసరు. ఈయన 1978 సం॥ మే నెలలో భారతదేశము వచ్చి శ్రీ సత్యసాయిబాబావారిని తొలిసారిగ దర్శించెను. ఈయన మనుష్యుల శిరస్సు చుట్టూ వుండు కాంతిపుంజమును (Aura) 'తేజస్సు' ను కనుగొనుటలో ప్రత్యేక నిపుణుడు. విద్యుదయస్కాంత తరంగములను ఫొటో తీయు 'కిర్లియన్' ఫొటోగ్రఫీ ద్వారా ఈయన అనేక ప్రఖ్యాత వ్యక్తులకు అనేక దేశములలో ఫొటోలు తీసి వారి వారి తేజస్సులను (Aura) రికార్డు చేసెను బాగా ఎక్కువ దివ్యశక్తిగల మానవులకు ఈ కాంతిపుంజము శిరస్సు చుట్టూ మూడు నుంచి ఐదు అడుగుల మేర వ్యాపించి ఉండునట కానీ శ్రీ సత్యసాయిబాబావారి తేజస్సు వారి శిరస్సు నుండి అనంతదూరం వ్యాపించియున్నట్టు రికార్డు చేయబడుటచే సత్యసాయిబాబావారితో సమానమగు దైవము మరి లేడని నిర్ధారణమొనర్చెను స్వామి శిరస్సు చుట్టు ఏర్పడిన దైవ తేజస్సును కిర్లియన్ ఫొటోగ్రఫీ ద్వారా చూడగనే 'బరనౌస్కి' దిగ్భ్రాంతుడయ్యెను. తన అనుభవాలు ఇలా వివరించారు. - సం )

బంగారు రంగు తేజస్సు బాబావారు కదిలితే - ఆయన చుట్టు ఆ తేజస్సు కూడా కదులుచున్నట్లుగా యున్న ఇటువంటి దివ్యపురుషుని నేనిదే మొదటిసారి చూచుట నేను హిందూ నమ్మకములో పెరిగిన వ్యక్తిని కాను. నేను కేథలిక్ క్రిష్టియన్ను, మరియు సైంటిస్టుగా శాస్త్ర విజ్ఞానములో పెరిగినవాడిని. నేను లైసెన్సు పొందిన హిప్నటిస్టుని నన్నెవ్వరూ హిప్నటైజు చేయలేరు మా దేశములో ఏ ఒక్క మనిషినీ, అతడెంత గొప్ప వాడైనా 'భగవంతుడని' అంగీకరించుటకు వీలుకాదు. అది విజ్ఞానశాస్త్రము ప్రకారము కూడా కుదరదు. కానీ నేను సత్యసాయిబాబావారి ముఖములోకి చూసినప్పుడు వారి కళ్ళు దైవతేజస్సుతో మిలమిల మెరిసినవి. నా శాస్త్ర విజ్ఞానమును ఆయన ముందు పందెము పెట్టి ఓడిపోయితిని నేనిట్లు మాట్లాడుట విని, నా స్నేహితులు నేను పిచ్చివాడినైతినని అనుకొందురు ఐనా ఫరవాలేదు. శ్రీ సత్యసాయిబాబావారు మాత్రము ఆ దివ్య తేజస్సును కల్గియే వున్నారు 'నేను భగవంతుడిని - నీవు కూడ భగవంతుడివే' 'కానీ నన్ను నేనెరుగుదును : నిన్ను నీ వెరుగవు' అని ఆయన చెప్పినది నిజము 'ఆయన కేవలము రెండు కాళ్ళపై నడుచు ప్రేమ స్వరూపియే ; ఆయన భగవంతుడే ; అట్టి నిస్వార్థ ప్రేమనే భగవంతుడందురు'

నా స్వానుభవమునిపుడు విపులముగా పేర్కొందును.

సత్యసాయిబాబావారి గురించి నేను విన్నాను కానీ రకరకముల మనోభావములు సాయిని గురించి నేను విన్న కథలు నమ్మశక్యము గాకుండా వున్నవి. నేను శాస్త్ర విజ్ఞానములో ఆరితేరినవాడి నగుటచే ; ఆధ్యాత్మిక అతీత మానసిక శక్తులతో రోగనివారణ చేయగల్గిన వారి గురించి నాకు కొంత తెలుసు. వొరేల్‌లోని ఓల్గా ((Olga in worell) లోర్డ్సు (Lourdes) మొ॥ చోట్ల ఇట్టి హీలర్సు కలరు కానీ తమ చెయ్యి ఒకసారి రోగికి తగిలితే చాలు, రోగము నయమవుతుంది అన్నచో నమ్మశక్యము కాకుండా వుండి, ఒకసారి భౌతికముగా వెళ్ళి సాయిబాబావారిని దర్శించాలనుకున్నాను.

శ్రీవాణి

1978 సం॥ జూలై నెలలో మొట్టమొదటి ప్రపంచ శాంతి మహా సభలలో పాల్గొనుటకు నేను బెంగుళూరు వచ్చితిని. ఈ శాంతి సమావేశమును బెంగుళూరులో ఒక పవిత్ర వ్యక్తి ఏర్పాటు చేసాడు. కానీ ఆయన సభలో మాట్లాడిన తీరు 'నేను ఏర్పాటు చేశాను - నేను ఏర్పాటు చేశాను' అని అహంభావంతో మాట్లాడడం చూస్తే ఇతడు పవిత్రుడేనా అని నాకనిపించింది. అప్పుడు శ్రీ సత్యసాయిబాబావారు బెంగుళూరులోని వైట్ ఫీల్డ్‌లోనే వున్నారని తెలిసినది. నేను టాక్సీలో వైట్ ఫీల్ చేరాను. వేలాదిమంది స్వామి దర్శనానికై కూర్చున్నారు. వారితోబాటు నేనూ కూర్చున్నాను. స్వామి వచ్చి దర్శనం ఇచ్చారు. ఆయన ఎవరికేసి కూడా క్షణంకంటె ఎక్కువసేపు చూచుటలేదు— అంతలోనే ప్రక్కన ఎవరినో వెతుకుచున్నట్లుగా కదలిపోయేవారు. పొట్టిగ, పెద్ద జుట్టున్న వ్యక్తి. ఆయన్ని చూసిన నా తొలి మధ్యాహ్నదర్శనంలో నాకు ఆయనలో ఏమీ ప్రత్యేకత కనబడలేదు. ఆ పూటే వెళ్ళిపోదామా అనుకున్నాను.

కానీ, నేను మర్నాడువరకూ అచట వేచియున్నాను. నేనలా వేచియుండటంలో నేనొక మహాశక్తిసంపన్నుడిని చూడగల్గుతానని నా అంతర్వాణి పలికినట్లయింది. మరునాడుదయం 5 గం॥లకు సుప్రభాతము తరువాత అందరూ నగర సంకీర్తన చేస్తున్నారు. నేను మటుకు నిలబడిచూస్తున్నాను. అంతలో స్వామి త్రయీ బృందావన్‌నుంచి బయటకు వచ్చారు. ఆయన దివ్యతేజస్సు (ఉదయిస్తున్న సూర్యుడిలా) బంగారుకాంతులను ఆయన నివసించు భవంతి అంచులను దాటి పైవరకూ వెదజిమ్మింది. మానవులలో బాగా ఎక్కువ దివ్యతేజస్సు కల్గిన వారికి సాధారణంగా మూడు నుంచి ఐదు అడుగుల కాంతి వలయమే ఉంటుంది. కానీ స్వామిలో నేనిది అపారంగా చూశాను. ఈ వలయాలు మానవుని మనోభావాలనుబట్టి రంగులు మారుతూ వుంటాయి.

నీలిరంగు కాంతివలయం— లోతైన ఆధ్యాత్మికతను ప్రేమస్వభావమును సూచిస్తుంది.

ఆకుపచ్చరంగు— రోగములను నయముచేయు హీలింగుశక్తిని సూచిస్తుంది.

పసుపుపచ్చ, బంగారురంగు— దైవశక్తిని— ఎక్కువ తెలివితేటలను సూచిస్తుంది.

ఎరుపురంగు— కోపమును, రజోగుణములను సూచిస్తుంది. నలుపు చెడు, భయం సూచిస్తుంది. పింక్‌రంగు (చంద్రకాంతపువ్వు రంగు) త్యాగముతో కూడిన నిస్వార్థప్రేమను సూచిస్తుంది. ఇది మానవులలో చాలా అరుదు. కానీ సాయిబాబావారి చుట్టూ ఈ పింకు రంగు వలయమే నాకు గోచరించింది.

స్వామి శరీరంనుండి వెలువడిన దైవతేజోపుంజము, స్వామి నిలబడిన భవంతిని దాటి సుదూరము వరకూ సుమారు 30 అడుగులనుండి 40 అడుగుల పరిధిలో ఈ కాంతివలయం ప్రసరించింది, నేను మొదట చూడగనే, అచటగల 'ఫ్లోరసెంటు' లైట్లు తమ దీపపుకాంతులను ఆయన మీద వెదజల్లుతున్నాయా అని క్షణం పరకాయించాను. అలా పరీక్షగా చూస్తున్నప్పుడు, స్వామి కదలగానే, 'పింక్'రంగు కాంతివలయంకూడా స్వామితో బాటు కదలడం చూసి నివ్వెరబోయాను.

నేనిదివరలోని నా అనుభవాలు జ్ఞాపకం చేసికొంటే, మాజీ ప్రెసిడెంటు 'గెరాల్డ్ ఫోర్డు' నెదర్‌లాండ్స్ రాణి జూలియానా; పోపు జాన్‌పాల్ మొ॥వారి కాంతివలయాలు నా మనసులో మెదిలాయి. కానీ ముఖ్యవిశేషం ఏమిటంటే, పైవారినే కాకుండా ఇంకా ఎందరో వేలాదిమందికి గల కాంతివలయాలను నేను స్టడీ చేసాను. కానీ, సత్యసాయిబాబావారి దివ్యకాంతి పుంజముతో మరి ఎవ్వరిదీ సరిపోల్చడానికి వీలుకాదు. ఈ దివ్యదృశ్యం చూస్తూ నేను అచట నగర సంకీర్తన చేస్తున్న భక్తులు పాడే పాటలు ఒకటి కూడా వినలేదు. నగర సంకీర్తన జరుగుతోంది అనుకునే లోపల స్వామి లోపలికి వెళ్ళి

పోయేరు. నాలుగు గంటల తరువాత (అంటే ఉదయం 9 గం॥లకు) తిరిగివచ్చి స్వామి ఇచ్చే ఉదయపు దర్శనం కోసం ఈ భక్తసమూహం అందరూ నగర సంకీర్తన అనంతరం అక్కడే మఠం వేసికొని (Cross legged) కూర్చుండిపోయేరు

వాతావరణం లేజీగా వుంది. ఉక్కపోస్తోంది. చెమటలు కారుతున్నాయి, గాలిలో తేమ ఏ క్షణం అయినా వర్షించవచ్చునన్నట్లుగా మబ్బులు క్రమ్మింది కొందరు భక్తులు నామస్మరణ చేస్తున్నారు. వర్షం మొత్తేసేలా కనిపిస్తోంది. మబ్బులు చూసి, "సత్యసాయిబాబావారు వర్షం రానివ్వరు" అని భక్తులు ఒకరితోనొకరు చెప్పుకొంటున్నారు.

అంతట్లో స్వామి మళ్ళీ దర్శనం యివ్వడానికి వచ్చేరు. ఆయన నావైపే వస్తున్నారనగానే నాగుండె వేగంగా కొట్టుకోసాగింది. అంతట్లో స్వామి వచ్చి నా ముందు నిలబడ్డారు. నాకేసి చూసి, స్వామి వెంటనే ఆ ప్రక్కనున్న వారికేసి తిరిగి, గాలిలో తమ చేతిని కదల్చగానే వారి చేతిలోంచి ఎన్నో లిల్లీ పుష్పాలు జలజలా రాలాయి. నా ప్రక్కనే వున్న వ్యక్తి తన దోసిలి పట్టాడు. ఆ దోసిలి నిండా లిల్లీ పుష్పాలు స్వామి చేతినుండి జలజల రాలాయి అంతటితో ఆ పుష్పరేకులు ఆగిపోలేదు అతని ప్రక్కనున్న రెండవ వ్యక్తి, ఆ ప్రక్కనున్న మూడవ వ్యక్తి చేతులలో కూడా తమ చేతితో సృష్టించిన లిల్లీ పుష్పాలను రాల్చేరు. ఆచటనుండి స్వామి, నాకేసి, "నేనేమి చేసానో చూసావా?" అన్నట్టుగ ఓ చూపు చూసి కదలిపోయేరు.

నేను ఏమీ చెయ్యలేక అలా చూస్తూ వుండిపోయాను. ఆయన చేతి లాల్చీ కొనలు చాలా పైకి ఎత్తిపెట్టి వున్నాయి. ఇది 'మేజిక్ ట్రిక్కు' కాదని తెలుస్తూనే వుంది. నేను హిప్నటైజు చెయ్యబడలేదు. నేను వారందరినీ చూస్తూనే వున్నాను. నేను లైసెన్సు పొందిన హిప్నటైజరుని. నన్ను హిప్నటైజు చెయ్యడం అంటే అది చాలా కష్టమైన పని. నా మనోస్థితినిబట్టి నేనొక (Miracle) అద్భుతమును చూసానని తలపోసాను. నేను చూసిన దానికి ఆశ్చర్యపడి, చాలా సేపు అక్కడే అలాగే కూర్చుండిపోయాను.

ఆ మరునాడు ఉదయం, స్వామి ముందరోజు వచ్చి దర్శనమిచ్చిన కాంపౌండు దగ్గిర చేరి మఠం వేసికొని కూర్చుని మళ్ళీ స్వామిని మరోసారి దర్శించాలని నిరీక్షిస్తున్నాను. నేనలా కూర్చున్నప్పుడు, నా అంతర్వాణి నాలోంచి ఏదో చెప్పదొడగింది. 'ప్రక్కన నిలబడ్డ స్త్రీలను దాటివెళ్ళి కొంతదూరం నడచి ఆ ఎదురుగా గోడకానుకొని వున్న వ్యక్తితో మాట్లాడు' అని నా అంతర్వాణి చెపుతున్నట్లనిపించింది కొత్తవారిని,నన్ను ఎఱుగని వానితోనూ, భాషరాని ఈ ప్రదేశంలో నేను స్త్రీలను దాటుకొని వెళ్ళి ఎలా మాట్లాడుట అని వూరుకున్నాను. కానీ మళ్ళీ నా అంతర్వాణి అదే విషయం చెప్పినట్లయ్యేసరికి ధైర్యం చెయ్యక తప్పలేదు.

నేను లేచి స్త్రీలను దాటుకొని, కొంత ఖాళీ ప్రదేశం దాటి, అచట గోడకానుకొని నిలబడ్డ ఒక అపరిచిత వ్యక్తి దగ్గఱకు వెళ్లాను

'నీకు ఇంగ్లీషు వచ్చుననుకొంటాను! నీతో మాట్లాడమని నా మనస్సులో అనిపిస్తే నీ దగ్గరకు వచ్చాను' అన్నాను.

ఆయన తన పేరు ప్రొ॥ నరేంద్ర అని పరిచయం చేసికొని, 'ఈ రోజు ఉపన్యాసం చెప్పే స్పీకరు నీవేనని స్వామి నాతో చెప్పారు. నీవు లెక్చరరు అనుకొంటాను కదూ;' అన్నాడు.

నిజమే నేను లెక్చరరునే. సుమారు తొమ్మిదివేల లెక్చర్సు నేనీపాటికి ఇచ్చి వుంటాను. ఐనా ఈ సంగతి ఇతనికెలా తెలుసు? అని ఆశ్చర్యపడ్డాను. ఆ ఉదయం మళ్ళీ బాబావారిని గమనిస్తూనేవున్నాను. అనేకమంది జన

సమూహాన్ని బాబా దీవిస్తున్నారు. వారికి ధైర్యం ప్రసాదిస్తున్నారు. వారి శరీరం నుండి జనించిన విశేష మైన పింక్ రంగు కాంతి సముదాయంతో జనులలో పుట్టిన ఎర్రని కోపోద్రేకమైన, నల్లని చెడుపనుల ఫలితమైన కాంతి వలయాలను తుడిచిపారేస్తున్నారు. ఈ విధంగా స్వామి ఎంతోమంది మనస్సులు మారుస్తున్నారు వారి భయాలను, బాధలను తమ దివ్య తేజస్సుతో నివారణ చేస్తున్నారు. ప్రపంచ నలుమూలలనుంచీ స్వామిని ప్రార్థించేవారికి సాయిబాబా తనను తానే సమర్పించు కొంటున్నారు

ప్రొ॥ నరేంద్ర నాకిచ్చిన సందేశాన్ని బట్టి నేను సత్యసాయిబాబావారి కాలేజీలో ఆ మధ్యాహ్నం మాట్లాడ వలసియున్నది ఎనిమిదివందల విద్యార్థులు, వందమంది ఉపాధ్యాయ బృందం నా లెక్చరు విన్నారు నేను సత్యసాయిబాబావారి ప్రక్కన ఆడిటోరియం వేదికపై నున్నపుడు వారి దైవతేజస్సు ఆ ప్లాట్‌ఫారం దాటిపోయి ప్రసరించి ఆ హాలులోనున్నవారందరినీ ఆవరించడం గమనించాను వెంటనే సాయిబాబా వారి ప్రేమ అచట నున్న వారందరికీ అందింది ఆ ప్రేమ అందగానే హాలులోనున్న వారందరూ ఆనందంతో పొంగిన హృదయావేశంలో స్వామిపై భక్తిగీతాలు ఆలపించారు.

'అవతార్' అన్న పదం ఏసుక్రీస్తువంటి దివ్యశక్తి లున్నవారికే ఉపయోగించాలి. కానీ అంతకంటే ఎక్కువ శక్తులున్న వీరికి భగవంతుడనే పదం ఉపయోగించాలి. కేథలిక్‌నైనా నేనీయన్ని గుర్తించలేకపోతే నా జన్మ వ్యర్థమే అనుకొన్నాను.

ఈ హాలులో అందరూ ఆలా భజనగీతాలు పాడుతుంటే స్వామి నాకేసి తిరిగి -

" నీవు ఎక్కువ ప్రేమగలవాడవు కనుక " .... అని; తమ ఖాళీ చేతిని నాకు చూపించి, గాలిలో తమ చెయ్యి గిరగిర త్రిప్పి నవరత్నాలు పొదిగిన బంగారపు ఉంగరం సృష్టించి .... 'ఇది నీ చేతి మొదటి చూపుడు వేలికి మాత్రమే సరిపోతుంది' అంటూ, స్వామి నా చూపుడు వేలికి పెట్టారు అది సరిగా సరిపోయింది. (తరువాత నేనీ వుంగరాన్ని అనేక విదేశాలలో నగల వర్తకుల వద్ద పరీక్ష చేయించాను. 900 నుండి 1100 డాలర్ల విలువ చేస్తుందన్నారు)

ఆ మరునాడు నాకు స్వామి ప్రైవేటు ఇంటర్వ్యూ ఇచ్చారు. నేనాయనతో 'జీసస్' తిరిగి పుట్టుట 'అవతార పురుషుడిగ' అనే విషయం: మరియు నా మనుమడి ఆరోగ్యం గురించి చర్చించాలనుకొన్నాను నా మనుమడికి గుండె వ్యాధి వుంది. పుట్టిన తరువాత ఏడాదిన్నర వయసులోపల వాడికి ఎన్నో ఆపరేషన్లు జరిగాయి. వాడు బ్రతుకుతాడన్న ఆశలేదు. నేను వాడిని మా దేశంలో విడిచి వచ్చాను. అసలిప్పటికి వాడు బ్రతికి ఉన్నాడో లేదో .... అని మనసులో అనుకున్నాను.

అసలీ విషయాలు ఏవీ కూడా స్వామితో చెప్పకుండానే ఇంటర్వ్యూలో స్వామి నాతో ఇలా అన్నారు. 'నీవు ఏరోజైతే "అరిజోనా" చేరుతావో ఆ రోజే మీ మనవడికి ఆపరేషను జరుగుతుంది వాడు బావుంటాడు అన్నారు స్వామి. అది సరిగాదనీ, వాడికి రెండేళ్ళు దాటితే కానీ ఆపరేషను చెయ్యనన్నారు సర్జన్లు అనీ వాదించబోయాను. కానీ స్వామి చిరునవ్వుతో మళ్ళీ చెప్పారు

స్వామి చెప్పినట్లే నేను అరిజోనా చేరిననాడు నా మనువడికి ఒక భారతీయ డాక్టరు ఆపరేషను చేసి ప్రాణం పోసాడు వాడు బావున్నాడు. ఇంతటి దివ్య తేజస్సు కల సాయిబాబావారు " అవతార్ " కాదు : భగవంతుడే.

)-○-(

# గీత - అమృతవర్షిణి

-సాయి గంగామహాదేవ్

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే ।
భూత భావో ద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః ॥

—అర్జునులవారు 'బ్రహ్మమనగా ఏమిటి? అధ్యాత్మ మనగా ఏమిటి ? కర్మ అనగా ఏమిటి ? ' అని ప్రశ్నింపగా భగవానులిచ్చట వాటికి సమాధానమిచ్చినారు.

"అక్షరం బ్రహ్మపరమం" - అక్షరము, పరమము ఐనటువంటిది - బ్రహ్మము. ఐతే అక్షరము, పరమము అనగా ఏమిటి ? అక్షరము :- అ + క్షరము = అక్షరము క్షరమనగా నాశనము. అక్షరము అనగా నాశనము లేనిది. అనగా శాశ్వతమైనటువంటిది . అని అర్థము. ఇంతేకాక, క్షరమనగా జీవుడు. ఎందువలననగా జీవత్వమే క్షరత్వము. 'అ' అనగా సంస్కృతమందు దైవము అని అర్థము. క్షరము 'త్వం' పదార్థము ; 'అ' తత్ పదార్థము, తత్, త్వంల ఏకత్వమే అక్షరము. అక్షరమనగా తత్త్వమసి స్వరూపము. జీవ, బ్రహ్మల ఏకత్వమే అక్షరత్వము అనగా జీవుడని, దేవుడని భిన్న భావన లేని దివ్యత్వమే అక్షరము

ఇక పరమం అనగా ఏమిటి ? పరమ మనగా శ్రేష్ఠమైనది, మేలైనది అని అర్థము అంతేకాక 'ఓం ఏవం పరమం మతే' పరమం అనగా ఓం అనగా పరమాత్మ యని అర్థము. ఇట్టిది బ్రహ్మము అనగా నాశనము లేనటువంటిది, భేదత్వము లేనటువంటిది: శ్రేష్ఠమైనది, మేలైనది, ప్రణవమైనటువంటిది - బ్రహ్మము బ్రహ్మ మనగా 'బృంహతీతి బ్రహ్మ' - నాంతః-బృహివృద్ధౌ' అనగా సర్వత్రా వ్యాపించినటువటువంటిది అనగా సర్వ వ్యాపకమైనటువంటిది బ్రహ్మము ఇక -

'స్వభావోఽధ్యాత్మ ముచ్యతే' స్వభావము అధ్యాత్మ మని చెప్పబడుచున్నది. ఐతే స్వభావమనగా ఏమిటి? ఒక్కొక్కరికి ఒక్కొకరకమైన మనస్తత్వం వుంటుంది. సామాన్యంగా అట్టి మనస్తత్వాన్ని వారి స్వభావమని అంటుంటారు. కానీ యదార్థంగా స్వభావమంటే వేదాంతంలో అదికాదు 'స్వ' మనగా ఆత్మ; 'భావ' మనగా కలిగినటువంటిది ఆత్మనుండి కలిగినటువంటిదానికి 'భావ' మని పేరు అదే మనస్సు కనుక స్వభావ మనగా మనస్సే ఈ మనస్సునకే ఆధ్యాత్మమని పేరు.

"భూత భావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః"

భూతం = వస్తువులకు ; భావః = ఉత్పత్తి ; ఉద్భవః = వృద్ధి ; కర = కలుగజేయునట్టి ; 'సర్గః' అనగా సృజ్యత ఇతిసర్గ- సృజింపబడునది. విసర్గ మనగా విశేషముగా సృజింపబడునది. అనగా పంచభూతములకు, లేదా భూతసంబంధిత వస్తువులకు ఉత్పత్తిని, వృద్ధిని కలుగజేయునటువంటి సృజింపబడినటువంటి తత్వమే కర్మము. ఇదియే కామము. అనగా కోరిక కోరికనే పంచభూతములను, భూత సంబంధ వస్తు విషయాదులను సమస్తమును సృష్టించి, పోషించుచున్నది ఒక్క కోరికనే లేకుండిన సమస్త సృష్టి లయమగుచున్నది. కనుక 'కర్మ' అనగా కోరికయే.

కోరికయే కర్మము ; మనస్సే అధ్యాత్మము ; భేద రహితమైనటువంటిదే, సర్వ వ్యాపకమైనటువంటిదే బ్రహ్మము కోరిక కాధారము మనస్సు ; మనస్సునకాధారము బ్రహ్మము నిరాధారము. కారణము బ్రహ్మము సర్వమైనటువంటిది. ఇట్టి బ్రహ్మమే సమస్త సాధనల మూలగమ్యము. అట్టి బ్రహ్మమునందు ఎల్లరు ఐక్యమై అనందామృతస్థితి నొందుదురు గాక ! స్వస్తి !

# ప్రాతఃస్మరణీయుడైన కులపతి వరదాచార్యులు

-కంచి వాసుదేవరావు

ప్రతి రంగంలోనూ ప్రాతఃస్మరణీయులైన సార్థక జన్ములు వుంటారు. సహకార వాణిజ్య బీమా రంగాలలో ఆంధ్రప్రాంతం నేటి స్థితికి కారకుడైన డా॥ పట్టాభి-ఆంధ్రదేశంలో తొలి సైంటిఫిక్ కంపెనీని స్థాపించిన అయ్యగారి రామమూర్తి - తెలుగు పత్రికా ప్రపంచంలో ధ్రువతారయిన ముట్నూరి కృష్ణారావు - తన యావదాస్తులను ధారపోసి దక్షిణ భారత దేశంలో తొలి జాతీయ కళాశాలను స్థాపించిన కోపల్లి హనుమంతరావు ఇట్టి ప్రాతఃస్మరణీయులే ఈ కోవకు చెందిన మహా పండితుడూ - విద్యావేత్త విద్యా పోషకుడూ కులపతి ఎస్. టి. జి వరదాచార్యులుగారు.

వరదాచార్యులుగారు సంస్కృతంలో ఎం. ఏ పాసయి మద్రాస్ రాష్ట్రంలో సంస్కృత పాఠశాలలో తనిఖీ ఇనస్పెక్టరుగా వుండేవారు కాని ప్రభుత్వోద్యోగం ఆయనకు నచ్చలేదు మహాత్మాగాంధి నాయకత్వంలో జరిగిన జాతీయ ఉద్యమాలు ఆయనని ప్రభావితంచేశాయి భారతీయ సంస్కృతికి మూలాధారమయిన సంస్కృత విద్యా వ్యాప్తికి కృషిచేయడం కూడా దేశసేవేనని ఆయన గుర్తించారు. అందుకు గట్టిగా కృషిచేశారు. ఆ కృషి ఫలితమే తన స్వస్థలం కృష్ణాజిల్లా చిట్టి గూడూరులో - తన విశాల భవనంలో స్థాపించిన శ్రీ నారసింహ సంస్కృత పాఠశాల - అంతకు పూర్వం బందరు వాస్తవ్యులైన పురాణం సూరిశాస్త్రిగారు తరకటూరులో సంస్కృత పాఠశాలను స్థాపించి దేవ భాషను సర్వులూ నేర్చుకునే అవకాశం కల్పించారు

అదే విధంగా నరసింహాచార్యులుగారు సంస్కృత కళాశాలను స్థాపించారు. ఆ కళాశాలలో కుల మత ప్రమేయం లేకుండా ఎవరయినా సంస్కృతాన్ని ఉచితంగా నేర్చుకునే వెసలుబాటు కల్పించారు వారికి హాస్టలు సదుపాయం కల్పించారు. తను స్వయంగా సంస్కృతంలో మహా పండితులు. వివిధ సంస్కృత శాఖలలో నిష్ణాతులైనవారిని అధ్యాపకులుగా నియమించారు. ఆచార్యులుగారు, అధ్యాపకులు - అంకిత భావంతో పనిచేయడం వలన ఈ కళాశాల అనేకమంది విద్యార్థులను ఆకర్షించింది. జ్ఞానులైన అధ్యాపకుల బోధనామృతాన్ని గ్రోలి - ఈ కళాశాల విద్యార్థులు తర్వాతి కాలంలో మహా పండితులుగా భాసిల్లారు ఈ కళాశాలకు ఆంధ్రప్రాంతంలోనే కాక ఇతర ప్రాంతాలలో కూడా మంచి గుర్తింపు లభించింది.

## ఆంధ్ర జాతీయ కళాశాల ఉద్ధారకులు

సంస్కృతం నేర్చుకోవడం ఎంత అవసరమయిన ఆధునిక శాస్త్రాలు నేర్పే కళాశాలల అవసరాన్ని కూడా ఆచార్యులుగారు గుర్తించారు అప్పుడు బందరులో ఒక్క హిందూ కాలేజీ మాత్రమే వుండేది చరిత్ర సృష్టించిన నోబులు కాలేజీ ఎప్పుడో మూతపడింది. అప్పటికీ కృష్ణా పశ్చిమ గోదావరి జిల్లాలలో - అనేక పట్టణాలలో డిగ్రి కాలేజీలు లేవు. బందరులో మరో కాలేజీని స్థాపించడం చాలా అవసరమని ఆయన గుర్తించారు అప్పుడు ఆయన దృష్టి సువిశాలమైన ప్రాంతములో - కొన్ని భవనాలతో మూతపడి దిక్కులేనిస్థితిలో వున్న ఆంధ్ర జాతీయ కళాశాలపై పడింది ఆంధ్ర జాతీయ కళాశాల ఒక చరిత్రను సృష్టించింది ఎంతో మంది యువకులైన దేశభక్తులను, జాతీయాభిమానులకు ఆది స్ఫూర్తికేంద్రంగా వుండేది బెంగాలీ చిత్రకారుడు

ప్రమోదమహత్ ఛటర్జీ జాతీయ కళాశాల చిత్రలేఖన శాఖలో వుండేవారు కోలవెన్ను రామకోటేశ్వరరావు, అడవి బాపిరాజు, కౌటూరు వెంకటేశ్వరరావు వంటి వారు సలపతులుగా వుండేవారు. వ్యవస్థాపకులైన హనుమంతరావుగారి అకాల మరణం తర్వాత కళాశాలను సమర్థంగా నిర్వహించేవారు లేకపోయారు అందువలన అది త్వరలో మూతపడి గతచరిత్ర శిధిలచిహ్నంలా వుండేది. అటువంటి కళాశాలను కాలానుగుణంగా పునరుద్ధరించాలని వరదాచార్యులుగారు భావించారు ఐతే దాన్ని పూర్వరూపంలో పునరుద్ధరించడంకన్న- ఆధునిక సైన్సు, ఆర్టు సబ్జక్టులు బోధించే కళాశాలగా పునరుద్ధరించాలని ఆయన భావించారు జాతీయ కళాశాల వ్యవస్థాపకులలో అప్పటికి జీవించి వున్న డా॥ పట్టాభి ఈ పునరుద్ధరణకు మొదట వ్యతిరేకించినా- తర్వాత మనసు మార్చుకుని వరదాచార్యులు గారికి పూర్తి సహకారం ఇచ్చారు.

ఆ విధంగా 1948 లో బందరులో ఆంధ్ర జాతీయ కళాశాల పునరుద్ధరణ జరిగింది. సమర్థులైన అధ్యాపకుల కోసం ఆచార్యులుగారు వెదకులాడవలసిన అవసరం లేకపోయింది బందరు హిందూ కాలేజీలో పనిచేస్తున్న అనేకమంది అధ్యాపకులను ఆచార్యులుగారు ఆకర్షించారు- మొరలి శివకామయ్యగారు (ఇంగ్లీషు) భాగవతుల కుటుంబరావుగారు (సంస్కృతం)- పువ్వాడ శేషగిరిరావు గారు (తెలుగు- ఆయన హిందూ కాలేజీలో పనిచేస్తూ- పాలకవర్గంపై అసంతృప్తి చెంది- విజయనగరం కాలేజీలో చేరి బందరులో జాతీయ కళాశాలను స్థాపించారనగానే బందరు మీద మమకారంతో జాతీయ కళాశాలలో చేరారు) పీలమూరి సుబ్రహ్మణ్యంగారు (కెమిస్ట్రీ) జొన్నలగడ్డ నారాయణశాస్త్రి, దర్భా శివరామకృష్ణయ్య, కోసూరు నారాయణరావు ప్రభృతులను అధ్యాపక బృందంలో జేర్చుకున్నారు. ఆంధ్ర జాతీయకళాశాలకు అనుబంధంగా సంస్కృత ఉన్నత పాఠశాలను స్థాపించి ఆంధ్రజాతీయ కళాశాల ఇంజనీరింగ్ విభాగాన్ని పారిశ్రామిక శిక్షణా కేంద్రంగా మార్చారు ఈ విధంగా సమర్థులైన అధ్యాపకులతో ఆంధ్రజాతీయ కళాశాల త్వరలోనే ఆంధ్రదేశంలోని ఉత్తమ కాలేజీలలో ఒకటిగా రూపొందింది ముక్కుసూటి మనిషి శివకామయ్యగారు ప్రిన్సిపాల్‌గా తన బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు.

## కష్టకాలంలో సిబ్బందికి కొండంత అండ

ఐతే కళాశాల ఆర్థికంగా అనేక ఇబ్బందులు ఎదుర్కొవలసి వచ్చేది. గ్రాంట్లు సకాలంలో అందేవి కావు అధ్యాపకులకు సిబ్బందికి నెలల తరబడి జీతాలు అందని క్లిష్టపరిస్థితులు ఏర్పడ్డాయి మరొకరయితే బెదరిపోయి - పారిపోయేవారే - కాని ఆచార్యులుగారు అనేక వేలు - లక్షలు - తన సొంత డబ్బు ముందుగా పెట్టుబడిపెట్టి - అధ్యాపకులను సిబ్బందిని ఆర్థికంగా ఆదుకున్నారు, తన పలుకుబడిని వినియోగించి కిరాణా కొట్లలో సరుకులు అరువు ఇప్పించేవారు అందువలన అధ్యాపకులు సిబ్బంది మరింత అంకిత భావంతో పని చేశారు చివరకు ఈ ఇబ్బందులన్నీ తొలగిపోయాయి.

1961 లో ఆచార్యులగారి ఆధ్వర్యంలో ఆంధ్ర జాతీయ కళాశాల స్వర్ణోత్సవాలు వైభవంగా జరిగాయి. అప్పటి ఉప రాష్ట్రపతి రాధాకృష్ణన్ – కేంద్ర విద్యా మంత్రి శ్రీ మాలి - ఆంధ్ర జాతీయ కళాశాల పూర్వ విద్యార్థి బెజవాడ గోపాలరెడ్డి ఈ ఉత్సవాలకు హాజరయ్యారు రాధాకృష్ణన్ దేశానికి స్వాతంత్ర్యం లభించాక రెండుసార్లు బందరు వచ్చారు. ఒకసారి ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ రజతోత్సవాలకు – రెండవసారి ఆంధ్ర జాతీయ కళాశాల స్వర్ణోత్సవాలకు. అయ్యగారి రామమూర్తిగారు, కోపల్లి హనుమంతరావు వరదాచార్యుల గారిమీద గల వ్యక్తిగత గౌరవ కారణంగా రాధాకృష్ణన్ వచ్చారు

## బి. యిడి. కళాశాల స్థాపకులు

ఆంధ్ర జాతీయ కాలేజీని మరింత విస్తృతపరచడానికి

ఆచార్యులుగారు ఎనలేని కృషి చేశారు కొత్త కోర్సులను ప్రారంభించడమే కాక 1967 లో బి యిడి కళాశాలను ఏర్పాటు చేశారు ఇందుకు ఆయనను తెలుగు విద్యార్థి సంపాదకులు కొల్లూరి కోటేశ్వరరావుగారు తనకుగల పలుకుబడితో పూర్తిగా సహకరించారు ఆ రోజులలో కోస్తా జిల్లాలలో—విజయనగరం, రాజమండ్రి నెల్లూరులలో మాత్రమే బి యిడి కాలేజిలుండేవి ఎన్నో అవాంతరాలు ఎదురొక్కొని వరదాచార్యులుగారు, కోటేశ్వరరావుగారు ఆంధ్ర జాతీయకళాశాల ఆవరణలో బి. యిడి. కాలేజిని స్థాపించగలిగారు. ఆ విధంగా ఆయన విద్యావేత్తే కాక విద్యా పోషకుడు కూడా అయ్యారు

వరదాచార్యులుగారు ఆ కాలపు సంస్కృత మహా పండితులలో ఒకరు ఆయన వంటి పండితులను వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. సంస్కృత కావ్యాలను తెలుగులోకి అనువదించినవారు చాలామంది వున్నారు— కాని తెలుగు కావ్యాలను సంస్కృతంలోకి అనువదించినవారు కొద్దిమంది మాత్రమే వున్నారు. వారిలో వరదాచార్యులుగారు ఒకరు. ఆయన వేమన, సుమతీ, కృష్ణ శతకాలను కాళహస్తీశ్వర శతకాలను సంస్కృతంలోకి అనువదించారు ఆయనను ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణతో సత్కరించింది.

ఆచార్యులుగారు విద్యావేత్త పోషకుడు మాత్రమే కాదు— బందరు పారిశ్రామిక ప్రగతిని ఆకాంక్షించినవారు, ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ నేషనల్ కెమికల్స్ వ్యవస్థాపకులైన అయ్యగారి రామమూర్తిగారికి ఆచార్యులుగారు అండగా నిలిచారు. ఆ కంపెనీలలో పెట్టుబడి పెట్టి వాటి డైరక్టర్ మండలిలో సభ్యులు అయ్యారు ఐతే రామమూర్తిగారి అకాలమరణం వలన ఆయన ఆలోచనలకు అంతరాయం కలిగింది. ఆర్థికంగా కొంత నష్టపడ్డారు.

బందరులో ఇప్పుడు ఆంధ్ర జాతీయ కళాశాలను సందర్శించినా, చిట్టి గూడూరులోని సంస్కృత కళాశాలను చూచినా వరదాచార్యులుగారు తప్పక గుర్తుకు వస్తారు. నిజంగా ప్రాతఃస్మరణీయుడు కులపతి వరదాచార్యులుగారు.



## ఓ కవీ !

బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

ఓ కవీ !
మనం ఊహల ఊపిరులున్న
నిత్య నూతన భావుకులం
ఋజువైన నిజ తేజమున్న
నవ చేతన భాస్కరులం...

డబ్బుకు కలం దాసోహం చేసి
అడ్డమైన గడ్డినే సిరాగా పోసి
గబ్బుకొట్టే రాతల్ని రాసేసి
అశ్లీలపు జబ్బుల్ని పెంచవద్దు.

సంఘ హితం కోరుతూ
సత్ సాహిత్యం సృష్టించాలి
మనోగతం శోధిస్తూ
వాస్తవ చిత్రం చూపించాలి...

అవివేక తుప్పును వదిలించి
అజ్ఞానపు ముప్పును తొలగించి
జాతిశక్తిని నిప్పులా వెలిగించి
నీతి స్ఫూర్తిని గొప్పగా నిలపాలి.

బలహీనతల్ని రెచ్చగొట్టకుండా
చరిత్ర ఘనతల్ని నిద్రపుచ్చకుండా
కలాన్ని కరవాలికలా మలుద్దాం
కాలాన్ని సంస్కరణంతో గెలుద్దాం...

# పట్టుదల

-సోమంచి రామం

మానవునికి విశేష పాండిత్యము ఉండవచ్చును. ఆతడు అఖండ ప్రజ్ఞావంతుడు కావచ్చును అనంత శక్తి యుక్తి సంపన్నుడై యుండవచ్చును సకల కళా ప్రవీణుడై ప్రకాశించవచ్చును అత్యంత ధైర్య స్థైర్య సాహసవంతుడై అలరారవచ్చును కాని కార్య సాధనకవసరమగు కఠోర కృషి లేనిచో ఇవన్నియును నిరర్థకములే అగును. అందుకే 'కృషి ఉంటే మనుషులు ఋషులవుతారు మహాపురుషులు అవుతారు' అంటాడో కవి

పూర్వకాలంలో బ్రూస్ అనే రాజు యుద్ధమందు పలుమార్లు పరాజితుడవుతాడు. శత్రువుల బారినుండి తప్పించుకొని, అడవులందు తలదాచుకుంటాడు. నిరాశ ఆవరిస్తుంది జీవితంపై విరక్తి కలుగుతుంది. దిక్కు తోచక, నిస్పృహతో దిక్కులు చూస్తున్న అతనికి ఓ సాలెపురుగగుపడుతుంది సాలెగూటినల్లుతూ, ఆ జీవి అప్పటికే పలు పర్యాయములు క్రిందకు జారిపోతుంది. అయినా పట్టు వీడక, మరల మరల పైకి ప్రాకి, కడకు గూటిని నిర్మిస్తుంది. సాలీడు సాహసం, పట్టుదల, బ్రూస్‌లో ఆశను, ఉత్సాహాన్ని చిగురింపచేస్తాయి. సడలిన ధైర్యాన్ని కూడగట్టుకొని, చెదరిన సైన్యాన్ని చేరదీసి, శత్రువునెదిరించి, విజయాన్ని వరిస్తాడు

మానవుని కృషి ఉంటే దైవ కృప తప్పక తోడ్పడుతుంది

అల్పాయుష్కుడని తెలిసినా సత్యవంతునే వివాహమాడుతుంది సావిత్రి భర్త వెంటే అడవులకు పోయి అత్తమామలకు సపర్యలు చేస్తుంది సత్యవంతునికి మృత్యు ఘడియలు సమీపిస్తున్నవని గ్రహించి ఉపవాసాలు- వ్రతాలు ఆచరిస్తుంది ఆ క్షణం రానేవస్తుంది. సత్యవంతునికోసం, యమవర్తే స్వయంగా వస్తాడు ఆతని ప్రాణాలు గైకొని పోతున్న యముని, వెంబడిస్తుంది సావిత్రి యముడెంత భయపెట్టినా, పట్టుదలతో అతని ననుసరిస్తుంది. ఆమె సాహసము, బుద్ధికుశలతలు, యముని మెప్పిస్తాయి అందుకు సంతసించి, కోరిన వరాలిస్తాడు. పతి ప్రాణాలనే సాధించుకోగల్గిన సావిత్రి, పట్టుదలకు ప్రతీక.

ఏకలవ్యుడు నిషాదపుత్రుడగుటచే, శిష్యునిగ స్వీకరించడు ద్రోణాచార్యులు ! అంతట ఆతడు అడవికేగి మృత్తికతో ద్రోణుని ప్రతిమను తయారుచేస్తాడు. గురువు భావంతో ఆ విగ్రహానికే నమస్కరించి, విలువిద్య సాధన ఆరంభిస్తాడు. పట్టుదలతో, స్వయం కృషితో, అనతికాలంలోనే అస్త్రవిద్యానిపుణుడౌతాడు.

తండ్రి తొడపై కూర్చున్న పసిబాలుడు ధృవుని, సవతితల్లి సురుచి క్రిందకు త్రోసివేస్తుంది. అభిమానవంతుడైన ధృవుడు తల్లి అనుమతినొంది తపోవనమునకు వెడతాడు. మార్గమధ్యంలో, నారదుని ఆదేశంతో విష్ణుమూర్తిని గూర్చి తపస్సు చేస్తాడు. పట్టువీడక కష్టభూయిష్టమైన కఠోరతపస్సు నాచరించిన ధృవుని పట్టుదలకు సంతసించిన విష్ణుమూర్తి ప్రత్యక్షమై కోరిన వరములనిస్తాడు

అందుకే "కృషితోనాస్తి దుర్భిక్షం" అన్నారు పెద్దలు పట్టుదలతో చేసే కార్యమే కృషి

దివంగత భారత ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రి, బాల్యంలో చదువుకొనేందుకు, బడికి వెళ్ళాలంటే నదిని దాటాల్సివచ్చేది పడవవానికి పైకమిచ్చి, నదిని దాటేవారంతా పేద కుటుంబంలో పుట్టిన శాస్త్రివద్ద పైకము లేదు పడవసరంగు ఉచితంగానే నదిని దాటిస్తానన్నాడు అందుకు మనసొప్పని శాస్త్రి. దుస్తులు, పొత్తములు తలపైనుంచుకొని, పట్టుదలతో ఈదుకొంటూ నదిని దాటి బడికి చేరుకుంటాడు పొట్టివాడైన శాస్త్రీజీ, పట్టుబట్టి పట్టుదలతో కృషి చేయబట్టే భారత ప్రధాని కాగలిగారు

నిజమే ! పట్టుదల గలవానికి అసాధ్యమేముంటుంది? ●

# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

—— శ్రీ ఆర్. కె. కరంజియా

( అనువాదము : డా॥ రాపర్ల జనార్ధనరావు )

భగవంతుడు భారతదేశంలో నివసిస్తున్నాడు. ఆయన సమకాలీనమైన అవతారములు మూడు — షిర్డి బాబా, సాయిబాబా, ప్రేమబాబా సుదీర్ఘమైన ఇంటర్వ్యూ నందు ముప్పురలో రెండవ అవతారమైన సత్యసాయి 'నేను మానవోద్ధరణకై రూపరహిత శక్తినుండి, సంపూర్ణశక్తులను గ్రహించి, నేటి అవతారమును దాల్చి వచ్చితిని' అని ప్రకటించుట విశేషము.

హైందవ ఆధ్యాత్మిక తత్త్వమెరుగనివారికి ఇయ్యది విచిత్రముగ దోచవచ్చును. అవతారములు బడయుట యనిన దైవము మానవరూపమున ఈ లోకమున అవతరించుటయే. ఈ సిద్ధాంతము హైందవధర్మసమ్మతము. భగవద్గీత యందు శ్రీకృష్ణపరమాత్మ తన అవతార ప్రయోజనంబు మానవాళిని అసురశక్తులనుండి రక్షించుటయే నని తెల్పియున్నాడు భూమాత పాపభారముల తోడ పరితాపము బొంది, పరమాత్మను తన భారమును తొలగింపజేయ వేడెనని పురాణములు పల్కుచున్నవి.

## భూలోక పాపములకు నివారణోపాయం

అణుబాంబుల సర్వ వినాశనస్థితి నుండి ఈ ప్రపంచమును రక్షించుటకై ఒక పరిష్కారముగ, ఒక నివారణోపాయముగ బాబా అవతరించినాడని బాబా శిష్యులు భావించెదరు. పాశ్చాత్యుల యందు దైవము వేరు మానవుడు వేరు అనెడి భావన భారతీయ వేదాంతమునందు కన్పడదు పురుషుని యందు దైవమును, దైవమందు పురుషుని చూచుట భారతీయ వేదాంతమందలి మూలసిద్ధాంతము.

ఈ సిద్ధాంత స్వరూపమే బాబా అవతారము వారు నాతో తెల్పినది కూడా ఇదియే. 'దైవము మానవుడు మానవుడు దైవము. మన అందరిలోను దైవతేజస్సు ఎంతో కొంత తప్పక ఉన్నది. మానవులందరు, నావలె మాంసళల్యధారులైనను మహిమాన్వితమైన మాధవశక్తి బడసియున్నవారలే. తారతమ్యమేమనిన వారు వారి యందు నిబిడీకృతమైన దైవశక్తిని గ్రహించలేకుండుటయే.

అనుమానములు, అనిశ్చితములు కలిగిన కొద్దిపాటి ప్రజల తరగతికి చెందిన నాకు, స్వామివారు ఇచ్చిన సందేశమిదియే 'సముద్ర గర్భమునుండి మంచి ముత్యములు సేకరింపదలచినవారు నీటి లోతులోనికి పోవలయును సముద్ర తీరమున గల జలమునందు లోతులేని తీరమున కిచ్చాటలాడువారు సముద్రమునందెట్టి ముత్యములు లేవని, అట్లున్నవని తెల్పెడువారు అసత్యవాదులని తెల్పుదురు. అటులనే దైవావతారమును దాల్చిన సాయిబాబా ప్రేమానుగ్రహములకు పాత్రులు కాదలచినవారు లోతైన హృదయము తోడ ఆరాధించవలసియున్నది. అప్పుడే అతడు నాతోడి తాదాత్మ్యము చెందును అతని హృదయాంతరాళములందు నన్ను భద్రపరచుకొనును '

## దైవానుగ్రహము, దైవకృప

నేనింకను ఆ తెలుపబడిన దైవకృప పొందుటకు సముద్రగర్భములకు చేరలేదు. బాబాతో నా పరిచయము కొద్దిపాటిది. బొంబాయిలో ఒకమారు కొద్దిసేపు తటస్థపడటం, పుట్టపర్తిలో మాత్రము సుదీర్ఘమైన సంభాషణ జరుగుట కొద్దిపాటి సంఘటనలు అయినను అవి విస్మయం విభ్రాంతి జనకం.

స్వామివారు తన ఉన్నతమైన సింహాసనమువంటి పీఠాన్ని వదలి నేనూ, నాతోడ వచ్చిన వ్యక్తి డా. సూరి

## సత్య సుగుణధామ !
## సాయిరామ !

బిచ్చమెత్తి తిరుగు పిచ్చి పకీరని
తూలనాడి నట్టి దుష్టులంత
సత్యమరసి నీకు సాష్టాంగపడుచుండ్రు
సత్య సుగుణధామ సాయిరామ ।

నారికేళములకు నీరాజనములకు
పొంగిపోను నేనులొంగబోను
నామ జపమె నిత్య నైవేద్యమంటివి
సత్య సుగుణధామ సాయిరామ ।

నన్ను జూడు నేను నిన్ను జూతుననుచు
పరమ సత్యమొకటి పలికినావు
నిన్ను చూడకుంత నేనెల్లు మననేర్తు
సత్య సుగుణధామ సాయిరామ ।

- ఏకా రామచంద్రరావు

భాగవతం, ఇందూలాల్‌షా గార్లతో నిరాడంబరముగా ఉన్న ఆ గదిలో మాతోబాటు కాళ్ళు మడతవేసికొని కూర్చుని రెండున్నర గంటలు సంభాషించారు డా॥సూరి భాగవతం, మాకు దుబాసీగా వ్యవహరించారు.

బాబా నుండి ఎంతో ఉజ్జ్వలకాంతిపుంజములు, ప్రేమ, దయలను గొలిపెడివి ప్రకాశింపజొచ్చినవి అదియేగాక నా జీవితంలోని అనేకమైన గోప్య విషయములు అతి సన్నిహితమైన వాటిని వారు ఎరిగినట్లు తెల్పుట నాకు అత్యంత ఆశ్చర్యాన్ని కలుగ జేసినవి నేను అడుగ దలచిన చిన్న ప్రశ్నలు, నేను అడుగక పూర్వమే వారికి తెలియవచ్చినవి. ప్రశ్న అడుగుట పూర్తికాక పూర్వమే నన్ను మోకాటిమీద మెల్లగతట్టి ఆపుమన్నట్టు చేసి సమాధానము తెలియజెప్పెడివారు నేను ప్రశ్నలను పూర్తిచేయకుండగనే సమాధానాలు అన్నింటిని పొంద గలిగాను

### మహదానంద నిలయము

స్వామివారి ఆశ్రమము ప్రశాంత నిలయము సుప్రతిష్ఠమైన ఆనందనిలయముగ అత్యంత త్వరితముగ వ్యాప్తి చెందుచున్నది. సర్వమత సమ్మేళనమైన 'వాటికన్' నగరమువలె రూపొందుచున్నది ఇచట ఏదో అనిర్వచనీయమైన మహత్తర శక్తి వ్యాపించియున్నది ఇచటకు వచ్చిన వ్యక్తులపై ఈ సమ్మోహన శక్తి చిందింపబడును స్వల్పమైన కార్యక్రమముల ద్వారా పరిశుద్ధమైన ఆధ్యాత్మిక వాతావరణము ఏర్పడును తెల్లవారు ఝామున నాలుగు గంటలకు మేల్కొల్పబడిన నేను ఓంకారనాదోచ్చారణలో ప్రశాంతమైన దేవాలయ ప్రాంగణమున పాల్గొన్నాను వేలకువేలమంది ఝుమ్మని ఓంకారనాదములు ఎలుగెత్తి సలుపగా దాని ప్రతిధ్వనులు మార్మోగినవి.

ఉరుములుఉరిమినట్లుసల్పిన ఓంకారనాదముపూర్తియైన పిదప ధ్యానమయమైన నిశ్శబ్దత నెలకొన్నది. ప్రశాంతి నిలయమున ఉద్భవింపజేసిన రీతి ఓంకారనినాదము మన నగరములలోను, దేశములోను కలుగజేసినచో ఎంతటి ఘనమైన అతీంద్రియ శక్తులను మనము సమకూర్చుకొనగలమోయను భావన కలిగినది. ఈ (ఓంకార) శక్తి వలన మనము పర్వతములను కదిలించగలము, ప్రవాహ రీతులను పలు విధముల మార్చగలమని తలచితిని. పూర్వకాలమున ఋషుముల యందు వర్షములకై, ప్రకృతివిధానమునే ఈ రీతిని మార్పు చేయగల్గిరని తెలియవచ్చుచున్నది.

ఓంకారస్వరమైనపిదప, భజనలు సాగినవి పుట్టపర్తిలోని పక్షుల సముదాయపు కిలకిలారావములు ఈఉదయపు వేళల భజనలకు సహకార వాద్యములగుచున్నవా అని అనిపించినది. ఉదయము 8 గంటలు అవగనే స్వామి

వారి దర్శనమునకై వేలకువేల ప్రజలు, అలంత దూరముల నుండి బయట సమావేశమైనారు.

కొద్దిసేపైన పిమ్మట ధగధగలాడే కాషాయవస్త్రము ధరించి, ఆఫ్రికనుల కేశశైలి కలిగి, ఒకమాదిరి ఎత్తుగ నున్న, సరళ శరీరము కల్గిన ఎల్లరు ఎరిగిన వ్యక్తి కానవచ్చినారు. ఆయన భక్తులు స్వామివారి జుట్టుకు అంటికొని శ్వేతము నీలవర్ణము కలిగిన తేజోమండలము తమకు కన్పించునని తెల్పుతారు. ఆ మహనీయుడు మెల్లగ నడచి సమావేశము చెంతకు వచ్చినారు.

అసలు ఆ నడకలోను, ఆ వ్యక్తిలోను, ఏదో అనిర్వచనీయమైన అలౌకిక శక్తి గోచరింపజొచ్చినది. కొందరు బాబా శరీరము శివ పార్వతుల కలయిక యని తెల్పెదరు. నిజముగ ఆయన శరీరమున స్త్రీ, పురుష లక్షణమున్నట్లున్నవి. పురాణములు స్తుతించినటుల, ఆయన శ్రీకృష్ణుని వలె కన్పించును. ఆయన నడిచే విధానము ఏదో ఒక నాట్యరీతిని తేలియాడినటుల, ఎంతయు అందముగ కన్పట్టును.

## శ్రీకృష్ణుని అవతారము

స్వామివారు భక్తసమూహమున నడచుచూ విభూతిని సృష్టించి ప్రసాదించుచూ, ఒకింత సేపు అచటనున్నటుల మరియొకపరి ఇచట నున్నటుల, ఒకపరి ఇతరులతో సంభాషించుచూ, వేరొకపరి తనలో తాను గానము సేయుచు, ఇతరులకు అభయముద్ర చూపుచు చేతులు త్రిప్పుచూ సంచరించినారు.

స్వామివారి దర్శనము భక్తులపై శక్తివంతమై వెన్వెంటనే జనించిన విద్యుత్‌శక్తి వలె విస్తరింపబడినది, క్రొత్తక్రొత్త శాగసరళులు సంగీతవాద్యకారులు సృజింపచేసి చివరకు ఆ మధురిమ నూత్నరీతులు సంతరించుకొని పరమాత్మయందు లయింపజేసిన విధమును, ఆ సన్నివేశము బొడసూపినది. బాబా, ఆయన శిష్యులు ఒకరికొకరు పోటీపడి, అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక అనుసంధానము చేయుచున్నట్లు అగుపడినది. ఈ దృశ్యము చూచినవారే విశ్వసింపగలరు.

ఈ సన్నివేశమంతయు నేను ఒకపంక చూచుచున్నను, నా మదిలోగల సంశయములు, ప్రశ్నలు, అనుమానములు, అన్నిటికిని నాకు సమాధానములు గాా లభింపజేయుచున్నారు. బీద ప్రజలను వదలి, ధనికులు, గొప్పవారిని ఆదరించువాడా ఈ స్వామి? లేదు. ఆయన సరాసరి సామాన్య జనము వద్దకు, రైతు ప్రజల చెంతకు వెళ్ళినారు. పిదప ఒక దజను పురుషులకూ ఒక డజను స్త్రీలకు ప్రత్యేక దర్శనమున రావలసినదని సూచించుచూ కొందరిని స్వహస్తముల సహాయము చేసి తమ గదికి గొంపోయినారు.

## ముందు బీదవారు, చివర ధనికులు

జరుగుచున్న ఈ దృశ్యమునంతయు నేను చాల తీక్షణముగ పరిశీలించినాను. ఆయన ప్రత్యేకముగ ఎన్నికచేయబడినవారు బీదవారు, బడుగువర్గములకు చెందినవారే. అందులో కొందరు అనారోగ్యముగ నున్నవారు, ఒక బాలునికి మతిస్థిమితము లేనటుల అగుపడినది. ఆ గదిలో నాలుగు గోడల మధ్య ఏమి జరిగినదో నాకు తెలియదు కాని గది నుండి వారు వెల్వడి నపుడు, వారి ముఖములయందు ఏదో సంతృప్తి, ప్రశాంతత నాకగుపడినది.

అటు పిమ్మట బాబా బయటకు వచ్చి నన్ను, సూరి భాగవంతంను, ఇందుభాయ్‌ని తీసికొని వెళ్ళినారు. నా వెనుక ఎంతో భాగ్యవంతుల కుటుంబం ఉన్నది. వారిని చూచుచు కదలివెళ్ళినాను. ఆ ధనిక కుటుంబం ప్రఖ్యాత పారిశ్రామికవేత్తకు చెందినది. గృహయజమాని మరణించిన పిదప ఆయన ఇల్లాలు బాబా ఆశ్రయమే తన గృహముగ చేసికొనినది. అయినను వారు మా రెండున్నర గంటల ఇంటర్వ్యూ పూర్తి అగువరకు నిరీక్షించుచు కూర్చుండిపోయినారు.

గనుక బీదవారు ముందు, ధనికులు పిదప అను విషయము తెలియవచ్చినది. ఈ ధనికులు, బీదవారి మధ్యన, ఒక మార్క్సిస్టు, ఒక సంశయాత్ముడుగ

# నివేదన

బాబా సన్నిధి మనకు పెన్నిధి
పరమ పూజ్యమోయీ
అతులిత మదితో కొలిచిన వారికి
అభయ మొసగునోయీ ॥

మధురిమ లొలుక మధువులు చిలుక
మాన్యుడతడేనోయీ !
బాబా మాటలు - బాబా చేతలు
భావిబాటలోయీ - భావిబాటలోయీ

కలతలు - కాంతులు కష్టసుఖాలకు
కారణమతడేనోయీ !
మంచి మనసుతో - మించు కొలువగా
వంచన లేదోయీ - మంచి జరుగునోయీ !

**- టి. కోటేశ్వరరావు**

ఉండిన నేను లోగడ సత్యసాయిబాబావారిని ప్రశ్నించి దుయ్యబట్టిన నేను పిలువబడినాను.

## బాబా సృజించిన ఆధ్యాత్మిక విప్లవం

బాబా నాతో తాను గొనితెచ్చిన ఆధ్యాత్మిక విప్లవము విశాలమైన ప్రాతిపదిక కలిగి, సర్వమానవ సౌభ్రాతృత్వము, సమత కలిగి త్రిపాదము కల్గిన మూడు 'W' అక్షరములను Work (కర్మయోగము), Woreship (భక్తియోగము) Wisdom (జ్ఞానయోగము) ల సమ్మిళితము అని తెల్పినారు. ఈసిద్ధాంతములకు అనుగుణ్యముగా నేను ఎన్నెన్నో ఉదాహరణలను అచట గమనించినాను. అచట దొడ్డి అంతయు పూడ్చుచున్నది ఒకనాటి మహారాణి. నాకు సహాయకారిగ వచ్చిన కార్యకర్త ఒకనాడు మెజిస్ట్రేటుచేసి న్యాయశాస్త్రరంగమును విడనాడి ఆశ్రమ వాసియైనాడు. నాకును బాబావారికి మధ్య తర్జుమాచేసిన వ్యక్తి భారత దేశమందలి అత్యంత ప్రసిద్ధుడైన విజ్ఞాన వేత్త (డా॥ సూరి భాగవతం) ఇంతకన్నను వేరుగ చెప్పవలయునా ?

నేను జరిపిన ఇంటర్వ్యూ బాబా మనోభావములను, తత్త్వరీతులను, అనుసరణ విధానమును అధ్యయనము చేసి 'బ్లిట్జ్' పత్రికయందు వరుసగ నాలుగు వారములు ప్రచురింపచేసియున్నాను. అందలి మొదటి భాగమున స్వామివారి మూడు అవతారములు వారి మూలసిద్ధాంతములైన ప్రేమ, సౌభ్రాతృత్వము, శాంతిని గూర్చి తెలియబరచితిని, విశ్వ మానవ ప్రేమవలననే ప్రపంచము, అణ్వాస్త్రయుద్ధమువలన నశింపబడక మనుగడ సాగించునని విషయము సూక్ష్మముగ విశదీకరించినాను.

రెండవ భాగమునందు స్వామివారి విద్య, వైద్య, సాంఘిక సేవలను గూర్చిన వారి పవిత్రాశయ సిద్ధికై చేసిన వ్యవస్థలను గూర్చి వ్రాసినాను. స్వామివారు సుమారు మూడువేల విద్య, వైద్య, సాంఘిక సేవా సంస్థల ద్వారా మానవులను వినూత్న విధానమున మహిమాన్వితులుగ చేసెడి ప్రయత్నములను గూర్చి విశదీకరించినాను.

మూడవ భాగమందు శ్రీ సాయిబాబా తనపై గల విమర్శలకు వారొసగిన సమాధానములు పొందుపరచబడినవి. చివరి భాగమున స్వామివారి అవతార విశేషము ఆధునిక యుగమునకు కలుగజేయు ఆధ్యాత్మిక పరిణితిని గూర్చి విస్తరించినాను.

( రాబోవు సంచికలో బాబావారు కరంజియా కొసగిన ఇంటర్వ్యూ పాఠము చూడవచ్చును. )

# అంకార్ వాట్ (Angkor Wat)

ఖండాలు పర్వతాలరావు

క్రాంపూచియాగా ప్రస్తుతం పిలవబడుతున్న దేశంలో వున్న అంకార్‌వాట్ దేవాలయాల సముదాయం అద్భుత నిర్మాణాలలో వొకటి దాదాపు 800 చ. కి. మీ. విస్తీర్ణంలో నిర్మించబడిన ఈ దేవాలయ సముదాయాలు అనేక కి మీ ల పొడవున సమాంతరంగా సరళరేఖల్లా నడచే పంటకాలువల ప్రక్కనా, వందలాది ఎకరాల పచ్చని వరి పొలాల మధ్యా నిర్మించబడి వున్నాయి ఈ నిర్మాణాలలో వందలాది మందిర సముదాయాలేగాక రెండు బ్రహ్మాండమైన సరస్సులు యింకా ఎన్నో చిన్న సరస్సులూ వున్నాయి. పెద్ద సరస్సులు దాదాపు 14 చ కి మీ వైశాల్యంతో చక్కని దీర్ఘచతురస్రాలుగా తీర్చబడ్డాయి దురదృష్ట వశాత్తు, అవన్నీ కారడవుల పాలయ్యాయి

వ్యవసాయాధారంగా వున్న ఈ ఖ్మేర్ (Khemer) నాగరికత క్రీ శ 9వ శతాబ్దంలో రాజా ఇంద్రవర్మ పాలనలో ప్రారంభమయింది. ఆయన కుమారుడు యశోవర్మ పాలనలో అంతస్థు, అంతస్థులుగా ఆకాశ మంటే పిరమిడ్ వలె బాకాంగ్ ఆలయాన్ని నిర్మించారు.

యశోవర్మ తరువాత వచ్చిన రాజులలో కొందరు బ్రాహ్మణ (వేద) మతావలంబులు కాగా కొందరు బౌద్ధ మతస్థులు తమకన్న ముందు తరంవారు కట్టించిన మందిరాలకన్న విస్తృతమైన ఆలయాలను వీరు పోటీ పడి నిర్మించారు అద్భుత మందిర సముదాయం అంకార్‌వాట్‌ను నిర్మించిన రాజా సూర్యవర్మ (II) కాలం (1113 – 1150) లో ఈ నాగరికత ఉచ్ఛదశను పొందింది అప్పైన ఎందుకో ఒక్కసారిగా క్షీణించింది.

తిరిగి రాజా జయవర్మ (VII) కాలం (క్రీ శ 1180 – 1215) లో మళ్ళీ ఇది అత్యున్నత స్థాయికి చేరింది ఈయన దేశ రాజధాని అంకార్‌థామ్‌ను కూడా పునర్నిర్మించాడు, 'విశ్వ సుఖశాంతులకు ఈ నగరం అంకితం' – అని ఆయన పేర్కొన్నాడు. ఈయన అనేక మందిరాలేగాక ఆసుపత్రులు, పేదలకు వసతి గృహాలు నిర్మించాడు ఈయన కాలంలోనే బేయాన్ మందిరాన్ని నిర్మించారు. ఒక్కొక్కటి 150 అడుగుల ఎత్తునవున్న 54 గోపురాలను ఈ మందిర సముదాయంలో నిర్మించారు ప్రతి గోపురం నాలుగువైపులా చిరునవ్వు చిందించే బుద్ధ భగవానుని ముఖం ఆకృతిలో నిర్మించబడింది అలా దాదాపు 160 అడుగుల ఎత్తున కన్పించే బుద్ధదేవుని ముఖాలు 200 కు పైగా అక్కడ దర్శనమిస్తాయి. జయవర్మ (VII) కాలంలో సాగిన బృహత్తర నిర్మాణ కార్యక్రమంలో బ్రహ్మాండమైన మందిరాలు వందలాదిగా నిర్మించబడ్డాయి అందుకు కావలసిన శిల్పులూ, వాస్తుశిల్పులూ, యితర అంగబలం, అర్థబలం ఎలా సమకూరాయో అర్థంకాదు ఒకేసారి అనేకచోట్ల అంతటి బృహత్తర నిర్మాణాలను ప్రారంభించి జయప్రదంగా పూర్తిచేయటానికి ఎంత ప్లానింగ్, వనరులు అవసరం? అవి ఎలా సమకూరాయి? అసలన్ని నిర్మాణాలను ఒక్కసారిగా ఎందుకు చేపట్టారు? తెలియదు ఖ్మేర్ నాగరికతకు ఆలంబన భారతనాగరికతే, ఖ్మేర్ ప్రజలు పూజించిన దేవతలలో నాగదేవత, శివుడు, విష్ణువు, బ్రహ్మ వున్నారు బెంతియాశ్రీ అనే చోట గల మందిరంలో బ్రహ్మాండమైన గరుడాళ్వార్ విగ్రహంవుంది తరువాత బౌద్ధవిగ్రహాలు కన్పిస్తాయి.

అంకార్ ఆలయాలలో మేరుమందిరం ముఖ్యమైంది. మేరుపర్వతానికి ఇది ప్రతీక. ఎంతో ఎత్తుగ అంతస్థు అంతస్థులుగా పెద్ద పిరమిడ్‌లా కట్టిన ఈ మందిర శిఖరంపై లింగప్రతిష్ఠ జరిగింది.

ఏ మందిరంపైనా దాని నిర్మాతల పేర్లు లేవు, ఖ్మేర్ నాగరికతను గురించి సరయిన పరిశోధన జరిగితే ఇంకా ఆసక్తికరమైన విషయాలనేకం వెలుగుచూస్తాయి. ముఖ్యంగా భారతజాతిలోనూ, హిందూ మతంలోనూ ఖ్మేర్ ప్రజలు పెంచుకున్న ఆత్మీయతా, అనుబంధం వెల్లడౌతుంది– అని ఆశించవచ్చు. 

# నేరం నాది కాదు

-ఆర్. యస్. కె. మూర్తి

'రాజు - ఏడు చేపలకథ' తెలియనివారుండరు. అతి పిన్న వయసులోనే మనమందరం ఆ కథ వినీ, చెప్పుకొనీ ఉంటాం. అయితే అదెంతటి అద్భుతమైన కథో మనకప్పుడు తెలియదు.

రాజు కొడుకులు ఏడు చేపలు తెచ్చి ఎండబెడితే, అందులో ఒకటి ఎండలేదు. ఎందుకెండలేదని అడిగితే- చేప సమాధానం తనకు దుబ్బు అడ్డం వచ్చిందని. ఎందుకు అడ్డం వచ్చావని దుబ్బునడిగితే దాని సమాధానం తనను ఆవు మేయలేదని. ఆవు ఆ పని చేయకపోవటానికి మరొకరు కారణం.

ఇట్లా ఎవరికి వారు తాము చేయవలసిన పనులు చేయకపోవటానికీ .... చేయ కూడని పనులు చేయటానికీ .... కారణం తాము కాదన్నట్లు మాట్లాడుతారు ఈ కథలో మన జీవితంలో లాగానే.

అయితే కథ చివరలో చీమ గట్టిగానే చెబుతుందనుకోండి - నా బంగారపు గూటిలో వేలు పెడితే కుట్టనా ?

చీమ చేసింది తప్పో, ఒప్పో - దానిని ఒప్పుకునే ధైర్యం దానికున్నది.

మనలో ఎందరికుంటుంది- ఇటువంటి నైతికధైర్యం?

**Passing the Buck**— అని ఇంగ్లీషులో ఒక మాట ఉంది నేరం నాదికాదు ; మరొకరిది - అనటమన్నమాట. ప్రతి ఒక్కరూ తాము చేసిన తప్పొప్పులకు యితరులు కారణమని ఒప్పించ చూస్తుంటారు. పరీక్ష తప్పిన విద్యార్థి ప్రశ్నాపత్రం కష్టంగా ఉందంటాడు ప్రజలను సక్రమంగా పాలించలేని ప్రభుత్వాలు అందుకు కారణం ప్రతిపక్షాలే అని వాపోతూ ఉంటాయి

కొన్ని రకాల ఆలోచనా ధోరణులు కూడ యిట్లాగే ఉంటాయి ఆకలితో అలమటించేవాడు దొంగతనంచేసినా తప్పు కాదని .... కుటుంబాన్ని పోషించటానికి మరొకటి చేసినా నేరం కాదనీ .... పగలంతా కష్టపడి పనిచేసే వాడు సాయంత్రాలు సారా త్రాగితే ఒప్పేనని .... ఇట్లా హత్యలు కూడ సమర్థించే ఆలోచనా రీతులు కొన్ని ఉన్నాయి ప్రపంచంలో.

## తప్పొప్పులు మనవే

ఇది సబబైన ఆలోచనారీతి కాదు మన తప్పొప్పులకు బాధ్యత మనదే అవుతుందిగాని, యితరులది కాదు. బాహ్యమైన ఒత్తిడులు, పరిస్థితుల వలన మనం తప్పులు చేశామని మనలను మనం ఒప్పించుకొనటం - మనకే హానికరమవుతుంది. ఫలానా తప్పు ఒకసారి చేశాం అనే గ్రహింపు మనలో వస్తే- మరొకసారి ఆ తప్పును మనం చేయకుండానన్నా ఉంటాం. అలా కాకుండా, మనం చేసిన తప్పుకు మనమసలు కారణమే కాదనుకుంటే ఎట్లా ?

అసలదీగాక నిజంగానే బాహ్యకారణాలవల్లనే మనం తప్పు చేశామని అనుకున్నా ఫలితం మనమే అనుభవించాలి గదా. రోజంతా వళ్లు పులిసేటట్లు పని చేయవలసిన దుర్భర పరిస్థితుల్లో ఉన్నవాడు దాని కారణంగా సారాయి త్రాగాడనుకోండి నష్టపోయేది అతని ఆరోగ్యమే కాదా ? సారాయిలోని విషం మనం చెప్పే కారణాలను వింటుందా ?

తెల్లవార్లూ మైకులు పెట్టారు, మనం శ్రద్ధతో చదువలేకపోయాం. చదువకపోతే పరీక్ష తప్పుతాం, మైకులు

పెట్టారని మొరపెట్టుకుంటే మటుకు మనలను పరీక్ష పాసు చేయిస్తారా ?

## గీతాచార్యుని ప్రబోధం

అసలిట్లాంటి ఆలోచనా ధోరణే తప్పు. "దుర్భర పరిస్థితుల్లో'' ఉన్నవారిలో ఏ 15, 20 శాతం మందో మాత్రమే దురలవాట్లకు లోనవుతారు. మిగతావారా పరిస్థితులను భరిస్తారు, చేతనైతే జయిస్తారు. కాబట్టి బాహ్య పరిస్థితులవల్ల తప్పులు చేస్తారనేది సార్వజనీన సత్యం కాదు. అదొక అపాలజీ మాత్రమే.

గీతలో నరుడు నారాయణుని అడుగుతాడు.

అథకేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥

కృష్ణా, నరుడు పాపమాచరించుటకు హేతువేమి? ఇష్టము లేకున్నను మనుజులు ఎవరో బలాత్కారముగా చేయించినట్లు పాపము లాచరింతురే! పాపాచరణకు కారణము బాహ్యమా, అంతరంగికమా ?

ఈ ప్రశ్నకు భగవానుడు స్పష్టమైన సమాధానమే చెప్పాడు కామక్రోధాలు పాపాచరణకు ముఖ్యహేతువు లని మనుజుని అంతరంగంలోనే పాపం ఉత్పన్నమవుతుందని.

కాబట్టి మన అంతరంగాలను పరిశుభ్రంగా ఉంచుకుందాం, పాపపు ఆలోచనలు దరిచేరకుండా చూచుకుందాం, కామక్రోధాలను అదుపులో ఉంచుకుందాం. తప్పులు జరిగితే, వాటిని ఒప్పుకునే నైతికస్థయిర్యాన్ని పెంపొందించుకుందాం, శిక్షలను ఆహ్వానిద్దాం మన ప్రవర్తనను సమున్నతంగా మలుచుకున్నాం.

ఎవరు చేసిన కర్మ
వారేద్వ వలెగాని
ఒకులెందు కేడ్వరో అన్నా

## యక్ష ప్రశ్నలకు సమాధానములు

" శ్రుతేన శ్రోత్రియో భవతి
తపసా విందతే మహత్
ధృత్యా ద్వితీయవాన్ భవతి
బుద్ధిమాన్ వృద్ధసేవయా "

- ధర్మరాజు

మానవుడు వేదాధ్యయనంవల్ల శ్రోత్రియుడౌతాడు. తపమాచరించడంవల్ల ఉన్నతస్థానాన్ని పొందుతాడు. అతనికి అండగా ఉండేది అతని ధైర్యమే. పెద్దలను సేవించడంవల్ల మానవుడు బుద్ధిమంతుడౌతాడు.

ఇదొక జానపద గేయం మన తప్పులకు మనమే చింతించవలసి వస్తుంది, ఇతరులపై నెట్టి తప్పించుకోలేం

నా బంగారపు గూటిలో వేలు పెడితే కుట్టనా? అన్న చీమ మాటల్లో ఉన్నది అహంకారం కాదు, కుట్టడం దాని సహజ స్వభావమన్న - నిరూపణ. అట్లాగే మన చెడుపనులకు మన నైజగుణమే కారణమవుతుందిగాని, ఇతరం కాదు.

మన నైజగుణాన్ని అవలోకించుకొని, దానిని విశుద్ధంగా మలుచుకునే ప్రయత్నం మనమే చేసుకుంటూ ఉండాలి— పెద్దల అడుగుజాడలలో.

)-○-(

# కొమరగిరి కారాగార లేఖలు

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 5-1-1977

ప్రియమైన జయా,

నేను ఇక్కడ కులాసా. ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలో 'సచ్ఛీలము'ను గురించి కొంత వివరించాను ఈ లేఖలో ఇంకా కొంత వివరిస్తాను.

శీలత్రయం : ఆధ్యాత్మికక్షేత్రమున విజయము గాంచవలెననిన ప్రతి మనుజుడు "శీలత్రయము"ను తప్పనిసరిగా కల్గియుండవలెను. దీనినే ఆంగ్లమున $P^3$ అందురు అనగా $P \times P \times P$. అనగా Purity (పవిత్రత), Patience (సహనం) Perseverance (పట్టుదల) ఎవని హృదయము ఈ శీలత్రయముచే నిండియుండునో, అట్టి సాధకునకు, విజయము విషయమై ఏ సంకోచమూ ఉండనక్కరలేదు. అతడు లక్ష్యమును నిరాటంకముగా చేరుకోగలడు ప్రతి ఒక్కరూ పవిత్రమైన గ్రంథములను చదువుతూ, పవిత్రమైన భావములను, ఆలోచనలను కలిగివుండవలెను. ఎటువంటి కష్టములొచ్చినప్పటికినీ, అవాంతరములు దాపురించినప్పటికినీ, ఎటువంటి పరిస్థితులలోనూ సహనమును కోల్పోరాదు పట్టుదల ఉంటేనే లక్ష్యమును చేరుకోగలుగుతాము విద్యార్థి పరీక్షలలో ఉత్తీర్ణుడు కావలెననిన పట్టుదల అత్యవసరం వ్యక్తి ఏ రంగములో విజయమును సాధించవలెననినా పట్టుదల ఆవశ్యకం కాబట్టి ప్రతి ఒక్కరూ ఈ శీలత్రయము (పవిత్రత, సహనం, పట్టుదల) ను సంపాదించి తీరవలెను.

శీలమే ప్రాణాధారం : ఎన్ని భౌతిక శక్తులు సంపాదించినప్పటికినీ, శీలం లేని శక్తివల్ల నిష్ప్రయోజనం ప్రతి జీవికి శీలం ఉండాలి శీలంలేని వ్యక్తి చిల్లికుండతో సమానం జీవితంలో ఎంతటి ఉన్నత పదవులనైనా సంపాదించవచ్చును సకల భోగభాగ్యములను చేబట్టవచ్చును శీలం కనుక లేకపోతే వాటన్నింటినీ కోల్పోతాం మనలో శీలం గనుక వుంటే దేనినైనా సంపాదించవచ్చును అది లేకపోతే ప్రతిదానినీ కోల్పోతాం శీలమే మానవునికి ప్రాణాధారం శీలం యొక్క ప్రాముఖ్యతను వివరిస్తూ ఒక చిన్న కథను వ్రాస్తాను

ప్రహ్లాదుడు : ప్రహ్లాదుడు మంచి దైవభక్తుడు. నిష్కామబుద్ధితో అనేక సత్కర్మల నాచరించి, అత్యున్నతమైన ఇంద్రపదవిని సంపాదించాడు పదవీ భ్రష్టుడైన అసలు ఇంద్రుడు విచారముతో దేవతల గురువైన బృహస్పతి వద్దకు వెళ్ళి తన గోడును చెప్పుకొని, తరుణోపాయాన్ని అర్థిస్తాడు. తిరిగి ఇంద్ర సింహాసనమును పొందటానికి ఉపాయమును చెప్పమని వేడుకుంటాడు. అప్పుడు బృహస్పతి ఒక చక్కటి సలహానిస్తాడు భిక్షక రూపంలో ప్రహ్లాదుని వద్దకు వెళ్లి, అతను దానం ఇచ్చే సమయంలో, అతని శీలమును దానముగా అడగమని సలహాయిస్తాడు బృహస్పతి సలహా ప్రకారం పదవిపోయిన ఇంద్రుడు భిక్షక రూపంలో ప్రహ్లాదుని వద్దకు వెళ్ళి అతని శీలమును అర్థిస్తాడు. ప్రహ్లాదుడు ఆశ్చర్యపోయి 'వట్టి శీలం వలన ప్రయోజనం ఏమిటి ? నా శీలమును నీవు కొని నీవేం చేసుకుంటావు ? ఇంకా ఏమైనా

కావాల్సి వస్తే తీసుకో!' అంటాడు. ఆ బిక్షకుడు మాత్రం శీలమే కావాలంటాడు. అది ఒకటే చాల నంటాడు. ప్రహ్లాదుడు ఎట్టి సంకోచం లేకుండా 'తీసుకో' అని అనడంతో ఒక తేజస్సు అతని దేహమునుండి బయటకు వచ్చి బిచ్చగాని రూపములో నున్న అసలు ఇంద్రునిలో ప్రవేశిస్తుంది ఆ బిచ్చగానిలో ప్రవేశిస్తున్న తేజస్సును చూచి, "నీవెవ్వరవు?" అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు. నేను నీ శీలమును. నీవు నన్నాతనికి దానం చేసావుగా బట్టి, నిన్ను వదలి అతనిలో ప్రవేశిస్తున్నాను." అని ఆ తేజస్సు బదులు చెబుతోంది. మరల కొంచెం సేపటికి మరొక తేజస్సు ప్రహ్లాదుని శరీరం నుండి బయటకు వస్తుంది. "నీవెవ్వరవు?" అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు అప్పుడు ఆ తేజస్సు "నేను నీ శౌర్యమును, శీలముయొక్క సేవకుణ్ని. నీలో ఉన్నంతకాలం నిన్ను సేవించాను. ఇప్పుడు శీలం నీ నుంచి వెళ్ళిపోయింది. కాబట్టి నేను కూడా శీలం వెంబడే పోతున్నాను." అని చెప్పి ఆ తేజస్సు బిచ్చగానిలో ప్రవేశిస్తుంది. చివరకు స్త్రీ ఆకారంగల ఒక తేజస్సు ప్రహ్లాదుని శరీరమునుండి బయటకు వచ్చి "నేను నీ యొక్క రాజ్యలక్ష్మిని. నేను కూడా శీలం సేవకురాలినే. శీలమును వెంబడించి నేనుకూడా పోతున్నాను" అని చెప్పి ఆ తేజస్సు కూడా బిచ్చగానిలో ప్రవేశిస్తుంది.

అంతట ప్రహ్లాదుడు తన అధికారాన్ని, వైభవాన్ని కోల్పోతాడు, పదవీచ్యుతుడవుతాడు, ఇంద్రపదవిని కోల్పోతాడు. బిక్షకరూపంలోనున్న అసలు ఇంద్రుడు తిరిగి ఇంద్రసింహాసనమును పొందుతాడు ఇక్కడ నేర్చుకోవలసిన నీతి ఒకటున్నది. మనలో శీలంగనుక వుంటే మనం దేనినైనా సంపాదించవచ్చును. శీలం గనుక లేకపోతే ప్రతిదానినీ మనం కోల్పోతాం. ఇది వ్యక్తి విషయంలో ఎంత నిజమో, జాతి విషయంలో కూడా అంతే.

మన జాతీయ జీవన పరంపరలో శీలమునకు అత్యంత ప్రముఖస్థానం యివ్వబడింది. శీలం రెండు రకములు 1. వ్యక్తిగత శీలం (Personal Character) 2. జాతీయశీలం (National Character) ప్రతి వ్యక్తిలో ఈ రెండు శీలములు సమానంగా ఉన్నప్పుడే వ్యష్టి, సమిష్టిల ప్రగతి సాధ్యమవుతుంది. ఇందులో ఏ ఒక్కటి లోపించినా వ్యక్తి ప్రయత్నం నిష్ప్రయోజనమవుతుంది. ఈ రెండూ ఒక నాణెమునకు వున్న బొమ్మ, బొరుసు లాంటివి. ఒక ప్రక్క జాతీయ చిహ్నం, రెండవప్రక్క నాణెంవిలువ వుంటుంది రెంటిలో ఏది అరిగినా ఆ నాణెం చెల్లదు ఈ రెంటిని గురించి వచ్చే లేఖలో వివరిస్తాను.

చిరంజీవులకు నా ఆశీస్సులు ...

ఇక ఉంటా ..

ఇట్లు

' నీ

సూక్తిసుధ

# శ్రీ జిడ్డు కృష్ణమూర్తి సూక్తులు

కొమరగిరి కృష్ణమోహనరావు

'ప్రేమలేని జీవితం లోతులేని గుంటలాంటిది. లోతైన నది జీవజల సంపదకు నిలయం. ఎన్నో జీవ రాసులు అందులో బ్రతుకుతుంటాయి. కాని లోతులేని గుంటలోని నీరు మాత్రం అతి త్వరగా సూర్య తాపానికి ఆవిరైపోతుంది' అని అంటారు పరిపూర్ణ మానవతావాది, మహాతాత్వికుడు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి. ఆయన మానవ జీవితానికి సంబంధించిన విషయాలనే ఎక్కువగా ప్రస్తావించేవారు. ప్రతి విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి పరిశోధించి పరీక్షకు నిలబడినదానినే స్వీకరించి వాటిని పదిమందికి పంచేవారు. ఆయనలో మేధా సంపత్తితోపాటు, మానవత్వం కూడా సమపాళ్ళలో వృద్ధి చెందుతూ వచ్చింది. అందువలననే వారు ప్రేమకు అగ్రస్థానం యివ్వగలిగారు. లోతైన నది ఏవిధంగా సమస్త జలసంపదకు నిలయమవుతుందో, అదే విధంగా ప్రేమగల హృదయం మాత్రమే సర్వులకూ ఆశ్రయమివ్వగలదని ఆయన పరిపూర్ణ విశ్వాసం ఒక్క ప్రేమతత్త్వం మాత్రమే కఠిన హృదయాలనైనా కరిగించి వేయగలదని ఆయన నమ్మకం

'ప్రేమ ప్రతిఫలమును ఆశించదు ప్రతిఫలమును కోరకుండా, ఇతరుల యెడల అనురాగ భావన కలిగి వుండటమే ప్రేమలక్షణం' అని అంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి. మరో సందర్భంలో ప్రేమకు స్వార్థం లేదు అది ఎన్నడూ, ఎవర్నీ, ఏమీ అడుగదు ఏమీ అడగకుండానే సర్వమునూ సమర్పించడం ప్రేమలక్ష్యం ఎల్లవేళలా ఇచ్చివేయడమే ప్రేమ పరమావధి మనం ప్రేమ చూపితే పశుపక్ష్యాదులు కూడా ఆత్మీయులౌతాయి. బహుదూరంగా ఉన్నవారు కూడా సన్నిహితులవుతారు. వియోగులను సంయోగపరిచేది ప్రేమ అక్రమపంథాలో సంచరించేవారిని సన్మార్గమున పెట్టగలిగేది ప్రేమ. మానవుని పశుపతిగా మార్చగలిగేది ప్రేమ ప్రపంచ శాంతికి ఆధారం ప్రేమ. ద్వేషపూరితమైన ప్రపంచమును స్వర్గధామం చేయగలిగేది 'ప్రేమ' ఒక్కటేనని శ్రీ జిడ్డు కృష్ణమూర్తి ప్రగాఢమైన విశ్వాసం.

ఈనాడు 'ప్రేమ' అనగానే ప్రేయసీ ప్రియుల మధ్య వుండే ఆకర్షణ మాత్రమేనని చాలామంది సామాన్యులు భావిస్తుంటారు. ఈ భావంతో శ్రీ జిడ్డు కృష్ణమూర్తి ఏమాత్రం ఏకీభవించేవారు కాదు. వారు ఒక సందర్భంలో మాట్లాడుతూ "ప్రేమ అంటే కామం కాదు, ప్రేయసికి, ప్రియునికి మధ్యవుండే ఆకర్షణ కాదు. ప్రేమించడం అంటే ఇతరుల యెడల చూపించే సానుభూతి కాదు, ప్రేమ ఇచ్చిపుచ్చుకొనే సరుకు అంతకన్నా కాదు. ప్రేమ అంటే ఉద్రేకం కాదు. అది తరిగేది కాదు, కరిగేది కాదు, అది పొగలేని జ్వాల. ప్రేమ ఒక్కటి మాత్రమే మనిషిలో మానసిక పరివర్తనను తీసుకొనిరాగలదు" అని అంటారు తల్లిదండ్రుల మీద చూపే ప్రేమలో ఆదరాభిమానాలు వుంటాయి అందులో మాతృపితృ భావనలు ప్రస్ఫుటమవుతాయి తల్లిపిల్లల యెడల చూపే ప్రేమలో అనురాగం మేళవిస్తుంది, మాతృత్వం ప్రతిబింబిస్తుంది' మాతృదేశం యెడల చూపించే ప్రేమలో 'మాతృదేశ భక్తి ఇమిడివుంటుంది. కనుక ప్రేమ సంపూర్ణంగా స్వార్థరహితమైనది. స్త్రీ పురుషుల మధ్యవుండే విరహ వేదనలకు, కామచేష్టలకు పూర్తిగా ఈ 'ప్రేమ' విరుద్ధ

మైనదని, అదిఒక పవిత్రబంధమని శ్రీ జిడ్డుకృష్ణమూర్తి గాఢమైన విశ్వాసం.

'భయం ఉన్నచోట ప్రేమ ఉండదు, ప్రేమ భయ మెరుగదు' అంటారు కృష్ణమూర్తి. ఇది యథార్థసత్యం. తల్లి తన బిడ్డను అనురాగంతో ప్రేమిస్తుంది. ఆబిడ్డకు ఎంతటి ప్రమాదం వాటిల్లినా ఏమాత్రం భయపడదు. ధైర్యంగా ఎదుర్కొంటుంది. పెద్దపులి వస్తే బిడ్డను వదలి పారిపోదు. ఆ పులితో పోరాడి, తన బిడ్డను రక్షించుకోవటానికి ప్రయత్నిస్తుంది. అవసరమైతే తన ప్రాణమునయినా పణంగా పెట్టి, తన బిడ్డను రక్షించు కోవటానికి ఏమాత్రం వెనుకాడదు. అందువలననే ప్రేమ భయమెరుగదన్నారు.

ప్రేమలేని జ్ఞానం మనల్ని నాశనం చేస్తుంది. ప్రస్తుతం అదే జరుగుతున్నది' అని తన ఆవేదనను వెలిబుచ్చారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి. ఇది వాస్తవం. మానవత్వం, ప్రేమతత్త్వం కొంతమంది శాస్త్రజ్ఞులలో లోపించడం వలన, వారు కనిపెట్టిన శాస్త్రవిజ్ఞానం. మానవపురోభివృద్ధికి గాక మారణహోమానికి ఎక్కువ ఉపయోగపడుతున్నది. ఇది మారాలి. మనం సంపాదించిన జ్ఞానం, విజ్ఞానం మానవాభ్యుదయానికి, మానవశ్రేయస్సుకు ఉపయోగపెట్టాలని శ్రీ జిడ్డు కృష్ణమూర్తి భావించేవారు.

“నీలో కనుక ప్రేమ లేకపోతే నీవు శవప్రాయుడవే, ప్రేమభావన నీలో కలుగకపోతే, నీవు అసహ్యంగా, క్రూరంగా ప్రవర్తిస్తావు' అని అంటారు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి. ప్రేమ, కరుణలు మానవునికి వుండవలసిన ప్రధానమైన సుగుణాలు. సమస్త జీవరాసుల యెడల దయ, ప్రేమ, కరుణలు చూపటం చేతకాని మనిషి, బ్రతికి ఉన్నప్పటికీ, చనిపోయిన వానితో సమానమేనని శ్రీ జిడ్డు కృష్ణమూర్తి అభిప్రాయం.

'నన్నొక దైవాంశ సంభూతుని చేయకండి. నాకు స్మారకమందిరాలు కట్టవద్దు, నా భౌతిక శరీరమును శుభ్రపరచి అగ్నికి అర్పించండి. ప్రార్థనలు, ప్రసంగాలు, ప్రజాదర్శనాలు వద్దు” అని వారి చివరి కోరిక. ఆయన కనుమరుగైనా, ఆయన ప్రవచనాలు మాత్రం, శాశ్వతంగా, చిరస్థాయిగా వెలుగును విరజిమ్ముతునే ఉంటాయి. ఆ వెలుగుబాటలో పయనిద్దాం. ఉన్నత లక్ష్యాలను సాధిద్దాం. ఇదే ఈనాటి మన కర్తవ్యం.

(ఆకాశవాణి సౌజన్యంతో – 11-5-1995)

# సత్యధర్మ శీల! సాయిబాల!

-రాయవరపు రవి

(బాలవికాస్ విద్యార్థుల కోసం)

ఏమి నోము ఫలమొ! ఏ పుణ్యభాగ్యమో!
ఎవరి నోటి వరమొ! ఏమి బలమొ!
సాయి భక్తులమయి జన్మించినారము!
సత్యధర్మ శీల! సాయిబాల!

సత్య ధర్మ శాంతి సత్ప్రేమలన్ తెల్పి
చావులేని చదువు సాయి చెప్పె!
సాయినాధుని బడి! సాక్షాత్తు హరి గుడి
సత్యధర్మ శీల! సాయి బాల!

కులము మతము లనుచు కుమ్ములాటలు వద్దు
మతము ఒకటె సాయి మతము మనకు!
హితము ఒకటె మనకు ఇచ్ఛతో హరిసేవ!
సత్యధర్మ శీల! సాయి బాల!

సాయి ప్రభుని చేరి! సంపూర్ణ శరణమ్ము
నీవె అనుచు పలికి నిలువ వలయు!
సర్వ కార్యములను సాయియే నెరవేర్చు!
సత్యధర్మ శీల! సాయి బాల!



# ఏకు ధైర్యం వుంటే...

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

'సత్యమేవ జయతే నానృతం' అన్నది సనాతన మైన సూక్తి. భారత ప్రభుత్వం ఆ సూక్తికెంతో ప్రాధాన్యత నిచ్చింది. సూక్తులు ఆచరణకు దారి తీస్తున్నపుడు ఆవరోధాలు అనంతం ఈ అవరోధాలు స్వార్థ రాజకీయ నాయకులుగ, అవినీతి సామ్రాట్టులుగ అవతరిస్తూ దేశాన్ని సర్వనాశన పథంలోకి మళ్ళింప యత్నిస్తున్నాయి.

ఈ దుష్ట సంస్కృతికి అడ్డుకట్ట వేసిన వారిలో, భారత ఎన్నికల కమీషనర్ శేషన్‌గారు అగ్రగణ్యులు.

శేషన్‌గారి మాటలు చాల కరుకుగా వుంటాయి చాల చేదుగా వుంటాయి కాని చేదుమాత్రల సేవనం తోనే దేశం కోలుకోవాలి. వజ్రాదపి కఠోరాని మృదూని కుసుమాదపి.

భారతదేశంలోని ప్రజాప్రభుత్వం వాస్తవమయిన ప్రజల ప్రభుత్వం కాదని, ప్రజల అభీష్టాలకు స్థానం లేదని, మనం భావిభారత పౌరులకు దుర్భరమైన దేశాన్ని అందజేయుచున్నామని శేషన్ పలుమార్లు తమ ఆవేదనను వెల్లడించారు.

ఎన్నికలు ఒక జాతరలా జరుగుతున్నాయి. అలా కాక ఎన్నికలు పవిత్ర కర్తవ్యంగా క్రమశిక్షణా యుతంగా జరగాలి, కాని జరుగుతున్నదంతా అక్రమ క్రమం, అవినీతిమయమ్.

శేషన్‌గారు లోగడ కేంద్ర పర్యావరణ శాఖలో కార్యదర్శిగ వుండేవారు. అప్పుడు ఆయన విదేశాలకు ఎగుమతి అవుతున్న కప్ప కాళ్ళను గురించి తెలుసు కున్నారు, ఎగుమతిని నిషేధించాలన్నారు. అచిరకాలం లోనే కోట్లకు పడగలెత్తాలనుకున్న ధనస్వాములు 40 టన్నుల కప్పకాళ్ళ ఎగుమతికి అన్ని హంగులు సమకూర్చుకొన్నారు. 40 టన్నుల కప్పకాళ్ళు కావాలి అంటే ఎన్ని కప్పలను చంపివుండాలి ! పశ్చిమ బెంగాల్ నుండి, ఈ ఎగుమతి జరుగనున్నట్లు విని హుటాహుటిన అక్కడికి వెళ్ళారు ఈ ఎగుమతికి సూత్రధారిని పట్టు కోవాలని శేషన్ నిశ్చయించారు వాడు అక్కడినుండి మద్రాసుకు వెళ్ళాడని తెలుసుకొన్నారు. ఈ అక్రమ వ్యాపారికి ఒక మంత్రిగారి మద్దతు వున్నట్లు శేషన్ తెలుసుకొన్నారు. పర్యావరణ శాఖ మంత్రిగారిని కలుసుకొని అక్రమ వ్యాపార వివరాలు చర్చించారు. ఈనాడు మనదేశంలో పేరు గాంచిన ముఖ్యమంత్రి ఆయన కప్పకాళ్ళ ఎగుమతి జరగాల్సిందే అన్నారు. కాని శేషన్ ససేమిరా అనుమతించను అన్నారు. 'మీకు చట్టాన్ని గురించిన పరిజ్ఞానం లేదన్నాడా మంత్రిగారు. తనకు చట్టం తెలుసు అంటూ అందలి అంశాలన్నిటిని లిఖితపూర్వకంగా చూపించారు. ఇంత జరిగినా మంత్రి తన మంకుపట్టు వదలలేదు. ఆ మంత్రిగారికి హిందీ భాష సరిగారాదు అది తెలుసుకొన్న శేషన్‌గారు తమ సుదీర్ఘ వివరణను హిందీలోనే వ్రాస్తూ "హోగా హోగా బద్‌నామ్ హోగా, లేకిన్ బద్‌నామ్‌నామ్ ఆప్‌కా, అగర్ హిమ్మత్ హోతో ఫైల్‌మే చలాయియే" అన్నారు.

శేషన్‌గారు దేశప్రజలను తన యజమానిగ భావిస్తున్నారు. నిర్మొహమాటంగా తమ విధులను నిర్వహిస్తూ, తనను ద్వేషించే వారినుండి కూడా ప్రశంస లందుకొంటున్నారు

దైవం అనుకూలిస్తే డిసెంబర్ 12, 1996 దాకా ఆయన మన ఎన్నికల కమీషనర్‌గా వుంటారు

ధూమకేతువులా వచ్చిన శేషన్ ధృవనక్షత్రంలా నిశ్చలంగా వుండటం మన ప్రజాప్రభుత్వం చేసుకున్న పుణ్యం.

# జర్వారు - ఫతే

కవుల ఆంజనేయశర్మ

సిక్కుల గురువైన గురుగోవిందును బంధించ డానికి, ఔరంగజేబు సైన్యం, మైదానంలో గుడారాలు వేసుకొని తిరుగుతోంది.

ఆకస్మాత్తుగా గుడారాల్లో కలవరం బయలుదేరింది. సైనికులు ఆయుధాలు చేబట్టి పరుగెత్తడం ప్రారంభిం చారు. యుద్ధంలో మొగలాయీ సైనికులను ముప్పు తిప్పలుబెట్టి, అదృశ్యమైన గురుగోవింద తిరిగివచ్చా డనుకొన్నారు సైనికులు.

కాని, ఎదురుగా 'జర్వారు-ఫతే'- అను ఇద్దరు బాల వీరులు ఎక్కడినుండో వచ్చి, గుడారాలమీద విరుచుకు పడ్డారు వారి సాహసానికి శత్రు సైనికులు ఆశ్చర్య పడి చూడసాగారు.

'పట్టుకోండి! పోనీయకండి' - అన్న సర్దార్ ఖాన్ సాహెబ్‌గారి కేకతో, ఆ బాలవీరులిద్దర్ని ముట్ట డించి పట్టుకొన్నారు సైనికులు.

తండ్రిని వెతుక్కుంటూవచ్చి, గుడారాలను చూచి, రెచ్చిపోయి, శత్రు శిబిరాలపై దుమికి దాడి చేసిన ఆ బాలవీరులు గురుగోవిందుని పిల్లలు.

ఆ బాలవీరులను చేతులు వెనుకకు విరిచికట్టి దర్బారు లోకి తీసుకువచ్చారు సైనికులు. పసివాళ్ళిద్దరిని చూచి, ముక్కుమీద వ్రేలు వేసుకొన్నారు యోధులంతా, వారి సాహస కబుర్లకి ఆశ్చర్యపడిన యోధులందరు, బాలురు చంపిన సైనికుల సంఖ్యను లెక్కపెట్టి ఆశ్చర్యపోయారు.

'ఎవరు మీరు?' - సింహాసనం నుండి ఖాన్ సాహెబ్ గట్టిగా అరిచాడు

'మేము భారతీయులం, కన్పించటంలేదా?' - అన్నారు ఆ పసివాళ్ళిద్దరూ ఒక్కసారిగా.

'అది కాదోయ్! నేనడిగేది, మీరెవరి పిల్లలని?'

'ఆహా! అలాగా! అయితే విను మేము గురు గోవిందుని పిల్లలం' - అన్నాడు పెద్దవాడయిన జర్వారు

'ఆ!' అని త్రుళ్ళిపడ్డాడు సింహాసనంలోని సర్దార్ ఖాన్ సాహెబ్. పిల్లలు దొరికారు వారి శిరస్సులు ఖండించడం మంచిదని ఆలోచిస్తున్న ఖాన్‌సాహెబ్, ఆ చిన్నారి ముఖాలను చూసి, వారి అమాయకత్వాన్ని కనిపెట్టిన అతని కఠిన హృదయం కాస్త మెత్తబడింది.

'మీ పేర్లేమిటి?' - ప్రశ్నించాడు ఖాన్‌సాహెబ్.

'నా పేరు జర్వారు, నా తమ్ముని పేరు ఫతే' - జవాబిచ్చాడు పెద్దవాడు

ఆ మాటలోని మంచితనానికి, ధైర్యానికి ఖాన్ హృదయం గందరగోళం చెందింది. వాళ్ళిద్దర్ని 'ఇస్లాం' మతంలోకి మారిస్తే తనకు పేరు ప్రతిష్ఠలు దక్కుతా యని, మొగలాయీ చక్రవర్తికూడా ఎంతో సంతోషిస్తా డని అనుకొన్నాడు. 'మీరిద్దరూ 'ఇస్లాం మతం' పుచ్చు కోవాలి' ఖాన్ అరిచాడు.

'ఎందుకు పుచ్చుకోవాలి?' - ప్రశ్నించారు బాలు లిద్దరు.

'ఎందుకేమిటి? పుచ్చుకోవాలి అంతే దానివల్ల మీకెంతో లాభం ఉంది. మీరు కోరినవన్నీ యిస్తాం' - అన్నాడు ఖాన్‌సాహెబ్

' పుచ్చుకొనేది లేదు ' - గట్టిగా చెప్పారు ఆ పసి పిల్లలు.

' ఫలితమేమిటో తెలుసా ? మరణశిక్ష ' - ఖాన్ సాహెబ్ అన్నాడు

' అంతేకదా : ' - అన్నారా పసిగొంతులు.

' అంత తేలిగ్గా ఉందా ? చూడండి ఏం చేసానో ' - అన్నాడు ఖాన్.

' ఇతర మతాన్ని పుచ్చుకొనేకన్న, చావే మేలు' - అన్నారా బాలులిద్దరు.

' దుర్మార్గులారా ! మీకు సజీవ సమాధి కట్టిస్తా ' - అని భయపెట్టాడు ఖాన్‌సాహెబ్ రకరకాల ఆశలు చూపి, వశపరచుకోవాలనుకున్నాడు ఆ బాలవీరులను, కాని ఫలితం దక్కలేదు.

వారి మొండితనానికి సభలోని వారంతా ఆశ్చర్య పోయారు. బాలుర నిద్దరినీ ఒకరి ప్రక్క ఒకరిని నిలబెట్టి, వారి మీదుగా గోడ కట్టడం ప్రారంభించారు. గోడ కడుతున్నంతసేపు ఖాన్ వారిద్దరిని ఇస్లాం మతం పుచ్చుకోమని బలవంతం చేస్తూనే ఉన్నాడు కాని లాభం లేకపోయింది గోడ కట్టడం చిన్నవాడి కంఠం వరకు వచ్చింది పెద్దవాడికి వక్షస్థలం వరకు వచ్చింది. తమ్ముణ్ని చూచి, అన్న కన్నులనుండి రెండు కన్నీటి బొట్టులు బైటపడ్డాయి ఖాన్‌సాహెబ్ ఇది చూచాడు. ' ఏడ్చి ప్రయోజనంలేదు. ఇప్పుడైనా నామాట వినండి. ఇస్లాం మతం పుచ్చుకోండి. మిమ్మల్ని ప్రాణాలతో విడిచిపెడ్తాం, ఎంతో గౌరవిస్తాం '- ఖాన్ అన్నాడు.

జర్వార్ నవ్వాడు. ' పాపీ ! నా ప్రాణాలకు భయ పడి కన్నీరు కార్చాననుకున్నావా ? కాదు. నా బొందెలో ప్రాణం ఉన్నంతవరకు అది జగరదు స్వధర్మా చరణతో చావుకంటే ఆనందం మరొకటిలేదు .

' మరెందుకు కన్నీరు వచ్చింది ? - అన్నాడు ఖాన్ ఆశ్చర్యంతో.

' నేను నా తమ్ముని కంటే ముందుగా పుట్టినవాడిని. నాకన్నా వెనుక పుట్టిన నా తమ్ముడు, తన ప్రాణాలను, మాతృదేవి చరణాలముందు, ముందుగా సమర్పించు కుంటున్నాడు నాకా అదృష్టం లేకపోయిందే, అన్న ఆవేదనతో కన్నీరు వచ్చింది ' - అన్నాడు జర్వారు.

ఖాన్‌సాహెబ్ ఆశ్చర్యపోయాడు, సమాధి గోడలు పైకి లేచాయి శత్రువుల నుండి తప్పించుకొంటూ యిల్లు చేరుకోవడానికి ప్రయత్నం చేస్తున్న గురు గోవిందుకీ విషయం తెలియదు. వద్దంటున్నా వినకుండా తండ్రిని వెదకటానికి బయలుదేర యింకా యింటికి చేరుకోని బిడ్డల కోసం ఎదురుచూస్తూన్న తల్లి మనస్సుకి ఏదో పిలుపు వినిపించినట్లయింది పిల్లల కోసం వెనక్కి తిరిగి చూచి నిరాశ చెందింది ఆ తల్లి మనస్సు ◯

# విదురనీతి

" యస్య కృత్యం న విఘ్నంతి
శీతముష్ణం భయం రతిః
సమృద్ధి రసమృద్ధిః వా
సవై పండిత ఉచ్యతే "

ఎవని కార్యము శీతోష్ణములుగాని, భయముగాని, అనురాగముగాని, కలిమిగాని, లేమిగాని అడ్డగింప జాలవో - అతడే పండితుడు.

# సాయిగీత

" న దాసో భవ వశ్యో వా
కస్యాపి యది దుర్గతః
భవవశ్యో భగవతః
కురు సేవాం పరాత్మనః "

ఇతరులకు దాస్యమును కావి, చెప్పుచేతలలో ఉండ టముగాని చేయరాదు భగవంతునికి మాత్రమే వశుడవై యుండుము. పరమాత్ముని సేవ చేయుము

# సాగర వ్యవసాయం

కె. ఆర్. కె. మోహన్

మనం నివసించే ఈ పృథ్విని 'భూగోళం' అని సామాన్యంగా వ్యవహరిస్తుంటాం. కాని నిజానికి దీనిని జలగోళం అని పిలవడం సబబుగా ఉంటుంది ఎందుకంటే భూమి ఉపరితలంలో ఐదింటి నాలుగువంతులు జలభాగమే. భూభాగంపై మనుగడ సాగించే మానవులు సముద్రంపై అనేక విధాలుగా ఆధారపడి ఉన్నారు ఆదినుంచీ కూడా మానవులు తమ ఆహార అవసరాలలో తగుమేరకు సముద్రంనుంచి లభించే చేపలు, రొయ్యలు, పీతలు, ఆలిచిప్పలు కొన్ని రకాల మొక్కలు వంటి వాటిని వినియోగించుకోవడం ద్వారా తీర్చుకుంటున్నారు. అసలు భూగోళంపై జీవం ఆవిర్భవించింది తొలిదశలో సముద్రంలోనే అంతేకాదు వివిధ రీతులలో వాతావరణంలో కలిగే మార్పులకు కూడ ప్రధాన కారణం సముద్రమే ఇకపోతే ప్రయాణాలకీ, సరుకు రవాణాకీ సముద్రానికున్న ప్రాముఖ్యం నిరుపమానమయినది ఈ ఆధునిక కాలంలో విజ్ఞానాభివృద్ధి ఊహకి అందనంత వేగంగా జరుగుతోంది. దీనితోపాటు మానవుని అవసరాలు కూడా అంతకంతకీ పెరుగుతున్నాయి. పైగా కోట్లాదిగా పెరుగుతున్న జనాభావల్ల కూడా అవసరాలు ఇబ్బడిముబ్బడి అవుతున్నాయి ఫలితంగా భూమిమీద పరిమితంగా వున్న వనరులు అపరిమితంగా ఉంటున్న అవసరాలకు అనుగుణంగా ఉండటంలేదు. ఈ సమస్యను పరిష్కరించేందుకు మానవుడు తప్పనిసరిగా తన దృష్టిని అపారసంపదగల సాగరం వైపుకు మళ్ళించవలసిన ఆగత్యం ఏర్పడింది దీని పర్యవసానమే ఆహార రంగంలో సాగరం సమకూరుస్తున్న జలసంపద.

## జల వ్యవసాయం

మానవుని మనుగడకు అతి ప్రధానమైనది ఆహారం. మామూలుగా అయితే ఆహారం ముఖ్యంగా సమకూరేది వ్యవసాయం మూలంగానే శాస్త్రీయవిజ్ఞానం విస్తరిస్తూండడంతో 'వ్యవసాయం' అంటే నేలపై పంటలు పండించటం అన్న పరిమిత అర్థానికి కాలదోషం పట్టింది మానవునికి ఆహారంగా ఉపయోగపడే ప్రతిదాని ఉత్పత్తి వ్యవసాయ పరిధిలోకే వస్తుంది. చేపలు, రొయ్యలు, ఆలిచిప్పలు వంటి సముద్ర జీవాలు ఆహార సమస్యా పరిష్కారంలో ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఈనాడు అపరిమితంగా పెరిగిపోతున్న జనాభా అవసరాలకి అనుగుణంగా ఈ సముద్ర సంపదను ఇతోధికంగా వినియోగించుకొనడం తప్పనిసరి. నేడు వివిధ ఆక్వాఫారాలలో రొయ్యలు, చేపలు పీతలు, లాబ్‌స్టర్స్ వంటి వాటిని పెద్ద యెత్తున పెంచడం జరుగుతోంది ఇందుకుగాను కృత్రిమ ఉష్ణం, కృత్రిమ కాంతి, కృత్రిమ పరిసరాలువంటి వాటిని కల్పించి ఉప్పునీటి వ్యవసాయం చేస్తున్నారు.

లు

ఇవన్నీ ఒక ఎత్తు. ఆలిచిప్పల పెంపకం మరొక యెత్తు. ఇవి సముద్రజలాలలో పెరుగుతాయి. వీటి పెంపకం కోసం స్వాభావికమైన సముద్ర జలాన్ని కాని, ఉప్పు కలిపిన నీటిని కాని ఉపయోగిస్తారు. ఈ నీటిలో వీటికి ఆహారంగా ఉపయోగపడే 'ఆల్గే' అనే నాచువంటి సముద్రజాతి మొక్కలను పెంచుతారు ఈ ఆల్గే త్వరత్వరగానూ అధిక పరిమాణంలోనూ పెరగడానికి ఈ

నీటికి మానవ మలమూత్రాలు ఉండే డ్రెయినేజీ నీటిని కలుపుతారు. తర్వాత ఈ నీటిలో అంచెలంచెలుగా చత్రాలుకట్టి వాటికి ఆలిచిప్పలను వ్రేలాడదీస్తారు. ఇవి అల్గేను, నీటిలోని మలమూత్రాలను ఆరగించి బాగా వృద్ధి చెందుతాయి. ఈ విధంగా వ్యర్థంగా పోయే మలమూత్రాలనుంచి కూడా ఎంతో అర్థాన్ని సాధించవచ్చు. ఇలాగే ఈ నీటిలో చిన్నచిన్న క్రిములను పెంచడంవల్ల అవి ఆలిచిప్పలు విసర్జించే పదార్థాలను తిని జీవిస్తాయి. ఈ క్రిముల్ని లాబ్‌స్టర్ వంటి చేపలు తిని బలంగా పెరుగుతాయి. ఈవిధంగా ఒకచోట ఆలిచిప్పల్ని, చేపల్ని కూడా పెంచవచ్చు.

## సముద్రపు మొక్కలు

సముద్రంలో 'కిల్ఫ' అనే మొక్కలు పెరుగుతాయి ఇవి మంచి బలవర్ధకమైన ఆహారంగా ఉపయోగపడతాయి జపానువారు శతాబ్దాలుగా వీటిని రకరకాల వంటకాల లోనూ వాడుతున్నారు. ఈనాడు అమెరికాలో అనేక రకాల సముద్రమొక్కల్ని ఐస్‌క్రీంలలోనూ, సలాద్‌లోనూ, అనేక ఔషధాలలోనూ ఉపయోగిస్తున్నారు.

ఈనాడు సాగరగర్భంనుంచి పెట్రోలియంనుతీయటం పరిపాటి అయింది ఇందుకోసం తీరంనుంచి అనేక కిలో మీటర్ల దూరాన కొన్ని సందర్భాలలో కొన్ని వందల కిలోమీటర్ల దూరాన రిగ్గులను దింపి ప్లాట్‌ఫాం లను నిర్మించి, నెలలతరబడి ఉండి పనిచేయవలసి ఉంటుది. అక్కడ పనిచేసేవారికి అవసరమైన ఆహారపదార్థాలను తీరంనుంచి జేరవేయడం వ్యయప్రయాసలతో కూడి నట్టిది. అందువల్ల అటువంటి ప్లాట్‌ఫాంల సమీపంలో 'ఫ్లోటింగ్ ఐలండ్స్‌ను' ను నిర్మించి వాటిపై కావలసిన పంటలను పండించే ప్రయత్నాలను చేస్తున్నారు శాస్త్రజ్ఞులు ఇప్పటికే కొన్ని పాశ్చాత్య దేశాలలో ఇటువంటివి ప్రయోగాత్మకంగా నడుస్తున్నాయి. ఇందు వల్ల ఆ మేరకు భూ వ్యవసాయంపై ఒత్తిడి తగ్గుతుంది. సమీప భవిష్యత్తులో మానవుని ఆహార అవసరాలకు భూమితోపాటు సముద్రం కూడా ఉపయోగపడుతుందన డంలో ఎంతమాత్రం సందేహం లేదు. ○

# బ్యూటీపార్లర్ నుండి....

-కామరాజు సరోజినీదేవి

'స్వరాక్తి సుధ' ఎ. ఐ. ఆర్. నుండే రానక్కర్లేదు వేదికలమీద ఉపన్యసించే వేదాంత ఉపన్యాసకుల ముఖతఃయే రానవసరంలేదు అతి సామాన్య వ్యక్తి నుండి, సామాన్య ప్రదేశం నుండి కూడ విలువైన ఉపదేశం వెలువడవచ్చు

చికాగో నగరంలో (అమెరికా) నున్న ఒక బ్యూటీ పార్లర్‌ను నడుపుతున్న ఒక యువతి, అతి సామాన్యం గానే కావచ్చు కాని ఎంతో జయప్రదంగా తన సందేశాన్ని ప్రజలకందిస్తుండేది శ్రీమంతులైన స్త్రీలు మధురాతి మధుర పదార్థాలు భుజించి శరీరాన్ని పెంచేసుకుని తత్ఫలితంగా, పెరిగే దేహాన్ని మాత్రం, నాజూకుగా, ఉంచుకోవాలన్న తపనతో .... ఎంతమందో, ఆమె పనిచేస్తున్న 'బ్యూటీ పార్లర్' కు వచ్చేవాళ్ళు. ఆమె వారి శరీరాలను వివిధ తైలాలతో, మర్దన చేస్తూండేది ఆ సమయంలో ఆమె ఆర్ద్రతతో పరమేశ్వరుని ప్రార్థిస్తూండేది 'పరమేశ్వరా ! నశ్వరమైన ఈ దేహాలను సుందరంగా, ఉంచుకోవాలని వీరు ఎంత తాపత్రయ పడుతున్నారో ! అంత ఆరాటంతో వీరు ఆధ్యాత్మిక పరంగా కూడ నీ ఆరాధన చేయుదురుగాక ! '

అంతేకాదు ఆమెకు ప్రత్యేకంగా ప్రతి వ్యక్తి, పార్లర్‌నుండి వెళ్ళిపోయేటప్పుడు కొంత సొమ్ము

ఇస్తుండేవారు దానినంతా ఒక చిన్న పెట్టెలో భద్రము చేసి, చైనాలో ఆరువందల కుష్ఠురోగులకు సేవనం స్తున్న ఒక సంస్థకు పంపుతుండేది ఈ ప. ఆమె చేయుటలోని అంతరార్థం ఏమిటి ? భగవత్ప్రసాదార్జితములైన ధన ధాన్యాదులతో తులతూగుతున్న వీరి డబ్బు, కొంతయినా, అతి ఘోరమైన వ్యాధితో బాధపడుతున్న మనుజులకు పంపవలెనన్న తీవ్ర ఆకాంక్షయే

ఈ ప్రపంచంలో జన్మించినందుకు, మనం తోటి మానవులకు, అవసరంలో ఉన్న వారిని ఆదుకోగలిగిన మనస్సుండాలి. మనకు పెద్ద ఉద్యోగం, హోదా ధనం, ఉండనక్కర్లేదు ధనంతోనే సేవచేయగలం అనుకోరాదు శారీరకంగా సేవలనందీయవచ్చు, వారి కొరకు ప్రార్థన చేయవచ్చు. మానవులందరిలో పరమేశ్వరుడున్నాడన్న భావం, మనం మరువరాదు మనం నేడనుభవిస్తున్న హోదా, సౌకర్యాలు, పరపతి, అన్నీ వరప్రసాదాలే మనకున్న అన్ని ఐశ్వర్యాలు భగవానుడు దానం చేసినవే' మనకు కావలసినంత వాటికన్న ఎక్కువ కూడబెట్టడం సంఘద్రోహం మనకన్న అదృష్టంలో తక్కువగానున్న వారితో పంచుకోవడం మనకే శ్రేయస్కరం. ○

శ్రీరామనవమి సందేశం.... ( 8వ పేజీ తరువాయి)

అర్థంకాదు అందువలన క్రమక్రమేణా దేహాభిమానమును మరచిపోవాలి, దైవాభిమానమును పెంచుకోవాలి. మానవుడైనటువంటివాడు మంచి మనసు, మంచి మాట, మంచి హృదయం మంచి నడతలను అభివృద్ధిపరచుకోవాలి. కనుకనే Be Good, Do Good, See Good- This is the way to God అన్నారు. ఈ విధంగా ఎవడు ప్రయత్నిస్తాడో వాడే ధన్యుడు. కాని ఈనాడు భౌతికమైన పదవులకు పరుగులెడుతున్నాడు

రష్యా, రుమేనియా, తూర్పు జర్మనీలలో అధికారమును హస్తగతం చేసుకోవడానికోసం మారణహోమాలు చెలరేగాయి తురుష్కుల పాలనలో కూడా తండ్రులను, సోదరులను చంపి సింహాసనాలను అధిష్టించారు, చెరసాలలో పెట్టి అధికారమును హస్తగతం చేసుకొనిన ఉదంతాలు కోకొల్లలు. కాని భారత దేశంలో మాత్రం అనాటి నుంచి ఈనాటి వరకు ఇలాంటి చర్యలకు ఎవరూ పాల్పడలేదు. ఈ ఆదర్శమునకు శ్రీరాముని ప్రభావమే కారణం. అరణ్యవాస సమయంలో రామలక్ష్మణులు ఒక చెట్టుక్రింద కూర్చున్నారు గుర్రముల సకలింపులు, ఏనుగుల ఘీంకారములు వినిపిస్తూవచ్చాయి. "లక్ష్మణా! ఈ అరణ్యములో ఈ శబ్దము లేమిటో చూడు!'' అన్నాడు శ్రీరాముడు లక్ష్మణుడు చెట్టుఎక్కి చూచాడు. భరతుడు పెద్ద సైన్యంతో రావటం చూచాడు "అన్నా! యుద్ధమునకు సిద్ధముకమ్ము. భరతుడు మన పైకి వస్తున్నాడు'' అన్నాడు లక్ష్మణుడు ''లక్ష్మణా! ఎంత పొరపాటు పడుతున్నావు తొందరపాటు పనికిరాదు. మనం అయోధ్యను వదిలే సమయమున భరత శత్రుఘ్నులు లేకపోవటంచేత, తిరిగి మనల్ని చూచే నిమిత్తమై వారిరువురు వస్తున్నారు'' అని సమాధానం చెప్పాడు రాముడు. "రామా! ఏమిటీ నీ శాంతం? ఏమిటీ నీ ధర్మం? ఏమిటి నీ సహనం? ఏమిటి నీ సానుభూతి? మనల్ని చూచిపోవటానికి వచ్చి వెళ్లే భరత శత్రుఘ్నులు సైన్యంతో వస్తారా? కాదు మనల్ని హతమార్చే నిమిత్తమై వస్తున్నారు'' అన్నాడు లక్ష్మణుడు ఈ విధమైన సంభాషణ జరుగుతుండగానే ''రామా! రామా!'' అంటూ పరుగెత్తుకుంటూవచ్చి శ్రీరాముని పాదాలపై పడ్డాడు భరతుడు. ''రామా! ఈ రాజ్యమును పరిపాలించడానికి నేను అర్హుడను కాదు. జ్యేష్ఠపుత్రుడైన శ్రీరామచంద్రుడే అయోధ్యను పాలించడానికి అర్హుడు కనుక దయచేసి అయోధ్యకు రావాలి'' అని శ్రీరాముని ప్రార్థించాడు భరతుడు ఈ ప్రార్థించే

సమయంలో రాముడు లక్ష్మణుని వైపుచూచి చిరునవ్వు నవ్వుతున్నాడు, అతని పలుకులు చక్కగా విచారించమని చెప్పాడు సామాన్య మానవుని యొక్క భావాలు ఈవిధంగానే ఉంటాయి దైవము యొక్క సంకల్పములు మరింత ఉత్తమమైనవిగా ఉంటాయి ఉత్తమ ఆదర్శములు నిరూపించేటటువంటి మానవుని యందే, ఇలాంటి ఉత్తమ భావాలు ఆవిర్భవిస్తుంటాయి అయోధ్యకువచ్చి రాజ్యపరిపాలన చేయమని శ్రీరాముని ఎంతగానో వేడుకుంటాడు భరతుడు. శ్రీరాముడు ససేమిరా అంగీకరించడు. వశిష్ఠుని ఆజ్ఞను పురస్కరించుకొని పాదుకలు యిచ్చి ఈ పాదుకలకే పట్టాభిషేకం చేయమని ఆజ్ఞాపించాడు శ్రీరాముడు. దీనియొక్క అంతరార్థమును చక్కగా గుర్తించాలి ప్రతి మానవుని యొక్క చెప్పుల (పాదుకలు)ను నీచాతి నీచంగా భావిస్తుంటారు లోకులు. కాని రాముడు దీనిక భిన్నంగా బోధించాడు. ఈ రాజ్యమనేది నాకు ఈ పాదుకలు (చెప్పులు)తో సమానం. కనుక వీటికే నీవు పట్టాభిషేకం చేయమన్నాడు రాముడు రామాజ్ఞను శిరసావహించి భరతుడు ఆ పాదుకలకే పట్టాభిషేకం చేసి, శాంతంగా రామచింతనతో కాలం గడుపుతూ వచ్చాడు

శ్రీరాముడు తన పాదుకలు భరతునకు యిస్తూ రాజ్యపాలన ఏ విధంగా ఉండాలో చక్కగా బోధించాడు 'గుణవంతులు, శీలవంతులు, శాంతవంతులు, సత్యస్వరూపులయినటువంటివారిని మంత్రులుగా ఎంపికచేయి ఈ నాలుగు గుణములు లేనటువంటివారిని నీవు మంత్రులుగా ఎన్నిక చేయవద్దు అంతే కాదు ఆత్మవిశ్వాసం గల వారిని నైతిక ప్రవర్తన గల వారిని, ధార్మిక భావాలు గల వారిని మాత్రమే మంత్రులుగా తీసుకో ఎందుకనగా నైతిక, భౌతిక, ధార్మికమనేటటువంటివి లోకమునకు చాలా ఆదర్శం. స్వార్థ స్వప్రయోజన పరులకు ఏమాత్రం అవకాశ మివ్వవద్దు దుర్వ్యసనములకు లోనైన వారికి ఏమాత్రం ప్రవేశంయివ్వవద్దు ప్రజారంజకులైనవారికి, ప్రజాభిమానులైనవారికి మంత్రివర్గంలో స్థానం కల్పించాలి. ఇలాంటి వారిలో ముగ్గురు లేక నల్గురు ముఖ్యులతో నిత్యమూ రహస్యసంప్రదింపులూ జరుపుతూ ఉండాలి, ఈ సంభాషణలు బయటకు తెలియరాదు ఇలాంటి రహస్యములను కాపాడినప్పుడే దేశం అభివృద్ధిగాంచుతుంది. సమాజంలో సుఖశాంతులు నెలకొంటాయి లోకకళ్యాణం జరుగగలదు. అంతేకాదు అన్ని ప్రదేశములకు దూతలను (రాయబారులు)కూడా పంపాలి వారు ఎట్టివారుగా ఉండాలి? రాజద్రోహులుగా ఉండకూడదు రాజ విశ్వాసులుగా ఉండాలి తప్పుడు సమాచారం ఇచ్చేవారుగా ఉండకూడదు. సరియైన సమాచారం అందించే వారినే నియమించాలి. అలాంటి వారినే నీవు దూతలుగా తీసుకో' అని శ్రీరాముడు అనేక అమూల్యమైన విషయాలు చెప్పాడు ఆనాటి రాముని యొక్క ఆదర్శములకుపూర్తిగా భిన్నంగా ఉంటున్నది నేడు అలాంటి పరిస్థితులలో రామరాజ్యం ఎట్లా రాగలదు ? రామరాజ్యం కావాలంటే ప్రవర్తన, గుణము, సదాలోచన – ఈ మూడింటి యొక్క ఏకత్వం అత్యవసరం ఇది కేవలం ఒక్క భారత దేశమునకే కాదు, యావత్ ప్రపంచమునకే ఇది అత్యవసరం రామరాజ్యమును స్థాపించాలనుకుంటే మానసిక పరివర్తన రావాలి. మానసిక పరివర్తన మనలో లేనంతవరకు మనకు 'రామా!' అనేటటువంటి అధికారము కూడా లేదు. రామతత్త్వాన్ని మనం ఆశిస్తున్నామంటే, రామ భావాలను కూడా మనం ఆచరించాలి పితృవాక్య పరిపాలనను శిరసావహించాడు. రాముడు ఇప్పుడు ఎవరు శిరసావహిస్తున్నారు ? శిరసావహించకపోగా తల్లిదండ్రుల మాటలను ఈనాడు తిరస్కరిస్తున్నారు. తండ్రి అంటే గౌరవమే లేదు, తల్లి అంటే అసలే లేదు. పిల్లలలో పరివర్తన రావాలి, పవిత్రత పెంపొందాలి. నిర్మలమైన భావాలను పెంచాలి. నిస్వార్థమైన జీవితాన్ని గడపాలి ఈనాడు మనం మన తల్లిదండ్రులకు ఏవిధమైన గౌరవం యిస్తామో, రేపు మీ పిల్లలు మీకు అదే విధమైన గౌరవమును యిస్తారు.

ఈనాడు పిల్లలను తల్లిదండ్రులే ఎక్కువగా చెడగొడుతున్నారు పిల్లలలో ఏ దోషమూలేదు ఈనాడు చాలామంది రావణ పుత్రులుగా తయారవుతున్నారు. అలనాడు రావణపుత్రులు తమ తండ్రి ఆజ్ఞను వింటూ వచ్చారు కాని ఈనాడు ఏ పుత్రులూ తండ్రి మాట వినటంలేదు.

ఈనాడు ఎవరూ నైతికమార్గమును అనుసరించడం లేదు. నైతికమంటే ఏమిటి ? నత- ఇతి- నీతిః అన్నారు. నీతి అనగా ఏమిటి ? మంచి ఆదర్శవంతమైన జీవితమును గడపాలి ఈనాడు చాలామంది ఇతరులను గురించే ఎక్కువగా మాట్లాడుతుంటారు. దైవచింతనను విస్మరిస్తున్నాడు, తన చింతనను మరచిపోతున్నాడు, లోక చింతనలోనే మునిగిపోతున్నాడు. ఈనాటి మానవుడు తాను అనుభవించడంలేదు, పరులకు అందించడంలేదు గడ్డివాముమీద కూర్చున్న కుక్క, గడ్డిని తినటానికి వచ్చే పశువులను రానీయదు, తాను ఆ గడ్డిని తినదు ఈనాటి మానవులు కూడా ఆ విధంగానే తయారైనారు. తాను అనుభవించడు, పరులకు పెట్టడు పవిత్రమైన జీవితాన్ని గడిపి దేశమునకు, విశ్వమునకు ఖ్యాతి నందించినవాడు రాముడు ఇలాంటి రామతత్త్వాన్ని మనం పండుగల మాదిరి చేసుకుంటున్నాముగాని, ప్రవర్తనారూపంలో అనుభవించడంలేదు. మనలో రామభావాలను పెంచుకోకుండా, రామ జన్మదినం చేసుకొని ప్రయోజనం ఏమిటి ? ఉత్తమ పురుషుల ఆదర్శములను మనం ఆచరణలో పెట్టాలి, వారి ఆదేశాలను మనం శిరసావహించాలి. అదియే నిజమైన భక్తికి తగిన అర్థం.

భక్తి.... భక్తి.... భక్తి.... అనగా ఏమిటి ? భజనలు చేయటమా భక్తి. స్వామి అంటే ప్రేమతో వెంట తిరగాడుటమా భక్తి, ఇదంతా నాటకములు. ఇదంతా స్టంట్స్, ఇదికాదు నిజమైన భక్తి. తెలుసుకున్నది ఒకటైనాకూడనూ ఆచరణలో పెట్టటానికి ప్రయత్నించాలి. 'భరతా ! తల్లిదండ్రులు, గురువులు, పెద్దలయెడల వినయ విధేయతలతో ప్రవర్తించాలి. మన రాజ్యం లోపల ఎవరైనా దారి తప్పి సంచరించినవారిని శిక్షించవద్దు రాజ్యమునుంచి బయటకు పంపించు. శిక్షించి ప్రయోజనమేమిటి ? దివ్యమైన పాలన నుంచి దూరంగా పంపించాలిగాని ఏమాత్రం శిక్షించవద్దు. అదే గొప్ప శిక్ష (Punishment) అని చెప్పాడు రాముడు. Punishment (శిక్ష) అంటే మీకు ఒక చిన్న అర్థం చెబుతున్నాను కొట్టనక్కరలేదు, తిట్టనక్కరలేదు, మాట్లాడకుండా వుండటమే గొప్ప 'పనిష్‌మెంట్' ఆచరణలో పెట్టని వానితో మాట్లాడి ప్రయోజనంఏమిటి? నేనూ వారివలె మాటను వ్యర్థం చేసుకోవటం నాకు ఇష్టం లేదు. నా మాటకు చాలా విలువ. వారికి తెలియక పోయినా నా మాట విలువ నాకు తెలుసు. నా మాట ఒక్కటి కూడనూ నాయొక్క స్వార్థంకోసం కాదు. ప్రతి ఒక్కటీ ప్రజలకోసమే అలాంటి విశాల భావం లేని, వ్యక్తిగత స్వార్థంగల వారితో ఎట్లా మాట్లాడటం ? ఈ స్వార్థం ఉన్నంతవరకు పరార్థం వారికి ఏమాత్రం అర్థంకానటువంటివారితో మాటలు వ్యర్థమే.

రామరాజ్యమంటే ఏమిటి ? రమింపజేసేటటువంటిది రామరాజ్యము ఎవరినీ ద్వేషించకుండా, హింసించకుండా, బాధించకుండా వుండేదే రామరాజ్యం, ఆ విధమైన భావములు మనలో ఏనాడు ఆవిర్భవించునో, అప్పుడు ఆ క్షణంలోనే రామరాజ్యం ఆవిర్భవిస్తుంది. తులసీదాస్ ఒక పర్యాయం ఈ విధంగా రాముని ప్రార్థించాడు, "ఓ రామా ! నా దగ్గర ఏ విధమైనటువంటి శక్తి లేదు. నేను ఏ యోగాభ్యాసములు చేయలేదు. ఏ ధనకనక వస్తు వాహనాదులు నా దగ్గర లేవు, నా దగ్గర ఉన్నది ఒక్కటే. అది నా ప్రేమ. ఆ ప్రేమ నిమిత్తమై నిన్ను ప్రేమిస్తున్నాను' అన్నాడు. భజనలు, యోగములు, జపములు - ఇవి కాదు భగవంతుని చేర్చేటటువంటివి. వీటిని చేయగూడదని నేను చెప్పటంలేదు. వ్యర్థమైన మార్గములలో ప్రవేశించేబదులు ఇలాంటి పుణ్యకార్యములు చేసుకోండి కాని భగవంతుని దక్కించుకోవాలంటే

చిక్కించుకోవలంటే హృదయ పరివర్తన కావాలి. విషపు విత్తులు నాటి తీయని ఫలములు కావాలంటే ఎట్లా లభ్యమవుతాయి ? ఏ విత్తనం నాటితే ఆ ఫలమే లభ్యమవుతుంది నీవు ప్రేమ విత్తనమును నాటు ప్రేమ ఫలమును పొందు.

పాపమును పెంచుకోవటమే చాలా కష్టము, పుణ్యమును పెంచుకోవటం చాలా సులభం, అసత్యమాడటం చాలా కష్టం సత్యం ఆడటంచాలా సులభం, ఎందువలనంటే సత్యానికి శ్రమ అవసరంలేదు. ఉన్నది ఉన్నట్లు మాట్లాడటం ఎంత సులభం ? ఉన్నదానిని లేనట్లుగా చెప్పాలంటే ఎంత కష్టమోపడాలి, ఎంత యోచనో చేయాలి కనుక అసత్యమనేటటువంటిది చాలా కష్టం, అన్యాయమనేటటువంటిది చాలా కష్టం ధర్మమనేది చాలా సులభం, సత్యమనేది చాలా సులభం. ఈ ప్రాకృతమైనది వదలటం చాలా సులభం ఇది కట్టుకోవటమే చాలా కష్టం. అనేకమంది చెబుతుంటారు 'స్వామీ ! మేము సంసారంలో పడ్డాము ఈ సంసారం మమ్ములను బాధిస్తున్నది వదలటంలేదు' అంటారు కాని పట్టుకున్నది నీవా ? సంసారమా ? సంసారానికి చేతులున్నాయా ? చేతులు నీకు ఉన్నాయి నీవు సంసారాన్ని పట్టుకున్నావు కాని సంసారం నిన్ను పట్టుకోలేదు నీవే సంసారాన్ని పట్టుకొని సంసారం నన్ను పట్టుకుందనుకోవటం ఎంత ఉల్లాసిదా ? ఈ విధమైన భావములచేత మానవుడు కాలాన్ని వ్యర్థం చేస్తున్నాడు, ప్రతి ఒక్కదానికి అభిమాన మమకారములే మూలకారణము ఈ Attachment (అనురాగము)ఉండాలి కర్తవ్యాన్ని ఆచరించాలి కాని ఎంతనో అంతవరకే. అంతేగాని 'కర్తవ్యంయోగముచ్యతే' అన్నారు మితిమీరిపోతే మతి చెడిపోతుంది. ఏ పని చేసినా దైవ కార్యంగా చేయాలి. దైవ విశ్వాసమే గనుక లేకపోతే మనం మానవులమేకాదు. ఎట్టివానికైనాసరే ఏదో ఒక సమయంలో దైవవిశ్వాసం వానిలో ఆవిర్భవిస్తుంది. గొప్ప నస్తికుడు ఉన్నాడనుకోండి తనకు కష్టములు వచ్చినప్పుడు బయటకు చెప్పుకోపోయినా, లోపల మాత్రం దైవమును ప్రార్థిస్తాడు. ప్రతి హృదయంలో కూడనూ దయ వుంటుంది అందులో భారతీయుల హృదయం ప్రేమతో నిండినటువంటిది. ప్రేమతో నిండిన హృదయాన్ని ఈనాడు విషమయంగా మార్చుకుంటున్నాడు ఒక్క మాటయినా మంచిమాటలేదు. ఒక్క చేష్టయినా మంచి చేష్టలేదు ఒక్క దృష్టిఅయినా మంచి దృష్టిలేదు భజనలో కూర్చుని కూడా వాళ్ళను వీళ్ళను చూస్తుంటారు. ఏమిటి ఈ కాకుల దృష్టి ? ఈ కాకుల దృష్టితో చూడటానికి బయటకుపోయి చూడగూడదా ? భజనలో ఎందుకు కూర్చోవాలి ? భజనలో కూర్చొని నీ దృష్టిని కూడా కంట్రోల్ చేసుకోకుండాపోతే వీడు ఏవిధమైన భక్తుడు ? సత్సంగంలో కూర్చుని దుర్భావములంతాకూడనూ తలచుకుంటుంటే వీడెంత భక్తుడు ?

ఒకానొక సమయంలో రాణి రాచమణిదేవి వారి దేవాలయం లోపల కృష్ణుని యొక్క కాలు పగిలిపోయింది అంగహీనమైన విగ్రహం దేవాలయంలో వుండకూడదని పండితులు చెప్పగా, మంచి విగ్రహమును ప్రతిష్ఠించడానికి ముహూర్తం పెట్టారు అప్పుడు రామకృష్ణుడు కంటిధారలు కార్చాడు. పాత విగ్రహమును మార్చడానికి వీలులేదన్నాడు. అప్పుడు రాణీ రాచమణితో "నీ అల్లుడు మధురనాధునికి ప్రయాణంలో కాలు విరిగిందనుకో అప్పుడు నీ బిడ్డను మరొకరికిచ్చి పెండ్లి చేస్తావా ? కాలు విరిగితే కట్టుగట్టి సరిచేసుకుంటారు కాని దూరం చేసుకోరు ఆదేవిధంగా నా కృష్ణునికి కాలు విరిగిందని తీసివేసి, మరో కృష్ణుని తీసుకొనివచ్చి పెడితే నేను ఊరుకోను. రేపటి దినమే పండితులను సమావేశపరచి పండితులతో కూడా వాదిస్తాను" అని చెప్పాడు రామకృష్ణుడు. రెండవదినం సమావేశం ఏర్పాటుచేశారు పండితులు, మేధావులూ హాజరైనారు. రామకృష్ణుడు భక్తిభావోద్రేకంతో చెబుతున్నాడు రాచమణి దానిని వినకుండా, రేపు కోర్టులో దానున్న

కేసును గురించి మనసులో ఆలోచిస్తున్నది. రామకృష్ణుడు పరుగెత్తుకొనివెళ్ళి రాణిమణి చెంప వాయించాడు. ఆమె చాలా అగౌరవంగా భావించింది. ఒక పూజారి (రామకృష్ణుడు) ఇంతమందిలో అవమానపరచినందులకు బాధపడింది. అప్పుడు రామకృష్ణుడు "కోర్టు వ్యవహారములు యోచించుకోవాలంటే, ఇంటికి వెళ్ళి యోచించుకో! ఈ సత్సంగంలో కూర్చొని కోర్టు విషయాలను గురించి చింతిస్తుంటే, దీనికి నీవు అర్హురాలవు కావని కొట్టాను" అన్నాడు. అటులనే భజనలో కూర్చొని, ఇతర విషయాలను యోచిస్తుంటే, అలాంటి వారు భజనకువచ్చి ప్రయోజనం ఏమిటి? సత్సంగమునకు వచ్చి దుస్సంగమం యొక్క విషయాలను విచారిస్తుంటే వాడు భక్తుడెట్లా అవుతాడు? సత్సంగం అంటే ఏమిటి? సత్ + సంగం. సత్ అంటే త్రికాల బాధ్యం 'సత్' సత్ అంటే Being, ఆ Being భగవంతుడే. భగవంతునితో సంగం చేయటమే సత్సంగం. అంతేగాని పదిమంది భక్తులతో చేరినటువంటిది కాదు. కనుక ప్రతి పదమునకు పవిత్రమైన అర్థం ఉంటున్నది. కాని ఇలాంటి అర్థములు చెబితే ఎవరికీ రుచించదు. లౌకికమైనటువంటి, భౌతికమైనటువంటి, తమాషా అయినటువంటి విషయాలు చెబితే చాలా ఆనందిస్తారు. కాని నాకు ఈ ఇచ్చకాలు ఆడటం ఇష్టంలేదు, చేతకాదు. సత్యాన్నే బోధించాలి. నేడు వినకపోయినప్పటికినీ రేపటికైనా వచ్చి విచారించుకోవచ్చును. కనుక ఈ భౌతికమైనటువంటివి, లౌకికమైనటువంటివి, ప్రాకృతమైనటువంటివి ఇది ఏనాటికైనా ప్రాపంచికములో తృప్తినందిస్తున్నాయిగాని, పారమార్థికంలో తృప్తిని ఏనాటికీ అందించవు.

భగవంతుడు భావప్రియుడేగాని బాహ్యప్రియుడు కాదు. నీవు బాహ్యాన్నే నిరంతరం ఉచ్చరిస్తున్నావు, బాహ్యాన్నే ఆచరిస్తున్నావు. భావం వరకు పోవటంలేదు. భావం వరకు పోకపోతే ఎట్లా? ఒక కొమ్మను కొట్టి ఇసుకలో పాతినంతమాత్రమున చెట్టు అవుతుందా? దానికి వేళ్ళు రావాలి. కాని మీరు కొమ్మ కొట్టి, పాతి ...ందులోనే పుష్టి భావం అనేటువంటి వేళ్ళు అందులో (హృదయంలో) నే దిగాలి. అప్పుడే బాహ్యమనేటటువంటి చెట్టులో ఫలములిస్తుంటాయి. కాబట్టి భావములు లోపల చేర్చుకొని, బాహ్యములో ఫలితాన్ని ఆశించు. ఇలాంటి సద్బోధనలు చేసి, సదవకాశమును అందించి, సార్థకం గావించిన రాజ్యము 'భరత రామరాజ్యము'. ఒక్క భారత దేశమునకే కాదు, యావత్ ప్రపంచమునకే ఈనాడు రామరాజ్యం కావాలి. 1. సత్ప్రవర్తన 2. సదాలోచన 3. సద్గుణం — ఈ మూడింటి యొక్క ఏకత్వం కావాలి. ఈ మూడు గుణములుగల రాజులు వాలి. ఈ మూడు గుణములు కల్గిన ప్రభుత్వం ఏర్పడాలి. అలనాటి రామరాజ్యం ఈ మూడు సద్గుణాలకు నిలయం. అయితే ఈనాడు ప్రవర్తనలు మరింత విచిత్రంగా వుంటున్నాయి. ఆలోచనలు చాలా వికారంగా ఉంటున్నాయి. గుణములు చూద్దామంటే చెప్పనక్కరలేదు. కనుకనే "మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం-మహాత్మనాం" అన్నారు. అలాంటి మహాత్ములు అధికారులుగా రావాలి. భక్తులైన మీరందరూ మీ హృదయాల లోపల పవిత్రమైన భావాలను నాటుకోండి. నేటినుండైనాసరే మీ దుర్భావనలు దూరం చేసుకోండి, దుశ్చింతనలు వదలుకోండి, పరుల చింతన వదలండి, దైవచింతన చేయండి. అదియే మీరు చేయవలసిన పని. మీ హృదయం ఒక రామరాజ్యంగా భావించుకోండి. మీ హృదయం రామరాజ్యమైతే జగత్తంతా రామరాజ్యమే అవుతుంది. రాముని ఆశయాలను మీలో చేర్చుకోండి. చేర్చుకొనిన ఆశయాలను ఆచరణలో పెట్టండి. అంతే చాలు. దీనికి ఏ శ్రమ పడనవసరంలేదు. ఏ నయాపైసా ఖర్చు చేయనవసరంలేదు. ఏ అరణ్యాలకు పోనవసరం లేదు. మీ ఇంట్లో మీరుండి మీ పనులు మీరు చేసుకుంటూ, మీ కర్తవ్యాలను నిర్వర్తించుకుంటూ, హృదయాన్ని పరిశుద్ధం గావించుకోండి!

(ది 9-4-95 న బెంగుళూరులో శ్రీరామనవమి సందర్భమున బాబావారు చేసిన ప్రసంగం నుండి)

# శ్రీమతి విల్మా బ్రాంకీ (Wilma Bronkey)

—సేకరణ : కె. వెంకటేశ్వరరావు

స్వామి షిర్డీ సాయి రూపంలో ఉన్నప్పుడు ఇలా అనేవారు. "నా మనుష్యులు ఎంత దూరంలో వున్నా 1000 క్రోసుల దూరంలో వున్నా పిచ్చుక కాళ్ళకు దారంకట్టి ఈడ్వబడినట్లు నా దగ్గరకు లాక్కుంటాను" అటువంటి ఒక పిచ్చుక గురించి ఇపుడు తెలుసుకుందాం.

"మానవసేవే మాధవసేవ" అనే సూక్తిని బలంగా నమ్మే వ్యక్తి శ్రీమతి విల్మా బ్రాంకీ ఆమె నివాసం అమెరికా దేశంలో పోర్టులెండు నగరానికి దగ్గర. వికలాంగులైన బాలబాలికలను చేరదీసి ఉచితంగా వాళ్ళకు సేవ చేయటం, వాళ్ళు పెద్దయిన తర్వాత సమాజంలోకి వెళ్ళి తమ కాళ్ళమీద తాము నిలబడటానికి వివిధ వృత్తులలో శిక్షణనివ్వటం, వాళ్ళకి పనిచేయని అవయవాలు కొంతవరకైనా ఉపయోగపడేందుకు కావలసిన మాలీషు (Physiotherapy) చేయటం తన జీవితధ్యేయంగా పెట్టుకొంది ఆమె

1974–75 ప్రాంతంలో ఒకరోజు ఆమెకు ఒక ఫోన్ కాల్ వచ్చింది. ఫోనులో ఒక అపరిచిత స్త్రీ కంఠం ఇలా పలికింది. "డాక్టరు బ్రాంకీగారూ, శ్రీమతి ఇంద్రాదేవిగారితో కలసి సత్యసాయిబాబాగారిని చూడటానికి భారతదేశం వెళతానన్నారట, విమానం టిక్కెట్ కొనటానికి అడ్వాన్సుగా 200 డాలర్లు పంపండి." శ్రీమతి విల్మా ఆశ్చర్యపోతూ ఇలా సమాధానమిచ్చింది. "ఇందులో ఏదో పొరపాటు వుంది నాకు భారతదేశం వెళ్ళే ఆలోచన లేదు, సత్యసాయిబాబావారు ఎవరు ?"

అవతల వ్యక్తి సమాధానం ఇవ్వకుండా ఫోను పెట్టేశారు. ఆ ఫోను గురించి శ్రీమతి విల్మా చాలా ఆలోచించింది. తనతో మాట్లాడిన వ్యక్తి తనను డాక్టరు అని సంబోధించింది కాని, తను డాక్టరు కాదు ఇంద్రాదేవిని గురించి తనకు కొంత తెలుసు. అమెరికా ఖండంలో గత 50 సంవత్సరాలుగ యోగశాస్త్రాన్ని నేర్పుతున్న వ్యక్తి ఇంద్రాదేవి. ఇక సాయిబాబా ఎవరు ? అనేది ఆవిడకు అర్థం కాలేదు. చాలామందిని అడిగింది. ఎవరో ఆమెకు హోవర్డ్ మర్ఫెట్ వ్రాసిన "సాయిబాబా–మాన్ ఆఫ్ మిరకిల్స్" అనే పుస్తకాన్ని ఇచ్చారు. శ్రీమతి విల్మాకి ఆ పుస్తకం ఎంతగానో నచ్చింది. సత్యసాయిబాబావారిని చూడాలనే కోరిక కలిగింది. ఇది జరిగిన కొద్దిరోజులకు ఒక యూనివర్శిటీ వారు శ్రీమతి విల్మా సేవలకు గుర్తింపుగా ఆమెకు గౌరవ డాక్టరేట్ బిరుదు ప్రదానం చేసారు. విల్మాకి ఆశ్చర్యం కలిగింది ఫోనులో ఆ అపరిచిత వ్యక్తి తనను డాక్టరు అని సంబోధించిన కొద్దిరోజులలోనే తనకు డాక్టరు బిరుదు రావటం కేవలం కాకతాళీయం కాదనీ, ఏదో అదృశ్య శక్తి పనిచేస్తున్నదనీ అనిపించింది. ఆ అదృశ్యశక్తి నిజంగా సత్యసాయిబాబాయే అయితే తన దర్శనం కోసం ఆయన తనను పిలుస్తున్నట్లయితే ఏదో ఒక అద్భుతం తనకు చూపించాలని ఆమె మనసులో అనుకున్నది.

శ్రీమతి విల్మాకు అనేక రకాల ఉంగరాలు పెట్టుకునే అలవాటుంది పనిచేసేటప్పుడు ఆవిడ ఆ ఉంగరాలను తన చేతి సంచిలో వేసుకుని, పని అయిన తర్వాత తిరిగి ధరించేది. వాటిలో ఒక ఉంగరం మీద ఆవిడకు మక్కువ ఎక్కువ ఆ ఉంగరం చాల చౌక అయిన లోహంతో చేయబడి, పైన నీలం రంగులో వున్న ఒక

గాజుముక్క అతికించబడి వుండేది. దానిని ఆమెకు తన ఇంట్లో వుంటున్న అనాథ వికలాంగ బాలలు క్రిస్టమస్ కానుకగా ఇచ్చారు. అందుకే ఆమెకు ఆ ఉంగరం అంటే ఎంతో అభిమానం.

విల్మా ఒకరోజు వికలాంగులైన బాలబాలికలకు శిక్షణ ఇచ్చే పద్ధతుల గురించి తీసిన సినిమా చూడటానికి తన స్నేహితురాలితో వెళ్ళింది. సినిమా హాలులో కూర్చున్న తర్వాత తన చేతి వ్రేళ్ళకు ఉంగరాలు ధరించలేదని గమనించింది. ఆ చీకటిలోనే తన చేతిసంచిలో నుండి ఒక్కొక్క ఉంగరమే తీసి ధరించింది. కాని ఆవిడ అభిమానించే ఉంగరం మాత్రం సంచిలో కన్పించలేదు. సంచి అంతా వెతికింది. ఎక్కడపెట్టి మర్చిపోయానో అనే ఆలోచనలో పడింది. అలా ఆలోచిస్తుండగా తన చేతి సంచిలోనుండి నీలం రంగు నిప్పురవ్వలు రావటం గమనించింది. మళ్ళీ ఆమె చేయి సంచిలో చేయి పెట్టి చూస్తే చాలా బరువైన ఉంగరం ఒకటి ఆమె చేతికి తగిలింది. అదేమిటో చూడాలని ఆమె సినిమా హాలులోంచి బయటకువచ్చి వెల్తురులో పరీక్షించింది, అది క్రిస్టమస్ కానుకగా పిల్లలు తనకిచ్చిన ఉంగరమే. కాని దానిపైన నీలంరంగు గాజు పెంకు బదులుగా ఎంతో విలువైన నీలం రాయి ఉంది. అది ఏమిటో తెలుసుకోవాలని తన స్నేహితురాలిని వెంటబెట్టుకుని ముగ్గురు బంగారు వర్తకుల వద్దకు వెళ్ళింది. ఒకరు అది ఖరీదైన నీలం అనీ, మరొకరు అది అరుదైన పచ్చ అని, వేరొకరు అది చాలా చక్కగా చెక్కబడ్డ వజ్రం అనీ చెప్పారు.

విల్మా ఈ సంఘటనను శ్రీ సత్యసాయిబాబా తనను భారత దేశం రమ్మని పిలుస్తున్న సంకేతంగా భావించింది. కానీ భారత దేశం వెళ్ళటానికి రెండు అడ్డంకులున్నాయి. మొదటిది తను లేనపుడు వికలాంగులైన పిల్లలను ఎవరు చూస్తారనేది, రెండవది భారత దేశం వెళ్ళటానికి కావలసిన ధనం తనకు ఎలా వస్తుంది అని.

మరో ఊర్లో వుంటున్న ఆమె కుమార్తె, అల్లుడు విల్మా భారతదేశం వెళ్ళేటట్లయితే పిల్లలను తాము చూచుకుంటామని ఆమెకు హామీ ఇచ్చారు. మరి కొద్ది రోజులకు ఆమె స్నేహితు లిద్దరు 2000 డాలర్లు ఆమెకు ఇచ్చి ఇలా అన్నారు. "మీ సేవలకు మీరేమీ ధనం తీసుకోరు. అందుకని మీకు డబ్బు అవసరం ఉంటుందని మాకనిపించింది. ఈ డబ్బు అప్పుగా తీసుకోండి. వడ్డీలేదు. మీకు వీలున్నప్పుడే తిరిగి ఇవ్వండి." (భారత దేశం దర్శించటానికి ఆమెకు కావలసిన ధనం సరిగ్గా 2000 డాలర్లు)

ఆమె రెండు సమస్యలు ఆశ్చర్యకరంగా మూడు రోజుల్లో తీరేటప్పటికీ, విల్మా ఇంద్రాదేవితో కలిసి భారత దేశం వెళ్ళటానికి పరిస్థితులు అనుకూలించాయి.

ప్రశాంతి నిలయంలో దర్శనం లైనులో ఆమె కూర్చున్నప్పుడు స్వామి ఆమె వద్దకు వచ్చి "ఉంగరం నచ్చిందా" అని అడిగారు.

ఆ తర్వాత ఇంటర్వ్యూలో స్వామి ఆమె సేవలను ఇంకా విస్తృతం చేయమని కాన్సరు వ్యాధి వచ్చి నయమయిన వారికి, అమెరికాలో పునరావాస కేంద్రం స్థాపించమనీ చెప్పారు.

శ్రీమతి విల్మా ఆ తర్వాత అనేకసార్లు స్వామి దర్శనం కోసం రావటమే గాక, అనారోగ్యంతో బాధ పడే అనేకమందిని తనతో స్వామి దగ్గరకు తీసుకు వచ్చి, స్వామి ఆశీర్వాదం వారు పొందేలా చేసింది.

మానవ సేవ చేస్తే భగవంతుడు సంతోషిస్తాడనటానికి శ్రీమతి విల్మా ఒక ప్రత్యక్ష నిదర్శనం. ◯

## మనవి

తమ చందాను సకాలంలో 'రెన్యూవల్' చేస్తూ, కనీసం ఒక క్రొత్త చందాను చేర్పించి పంపి "శ్రీవాణి"ని ప్రోత్సహించ ప్రార్థన. ఉత్తమ విలువలను పెంపొందిస్తున్న, ఆధ్యాత్మిక భావాలను పదిమందికి పంచుతున్న 'శ్రీవాణి'ని ఈమాత్రం ప్రోత్సహించలేరా ? సహృదయంతో ఆలోచించండి ! సహకారం అందించండి ! తమ విద్యుక్తధర్మాన్ని నిర్వర్తించండి ! — సం॥

# అధిక దిగుబడికి స్వచ్ఛమైన సోనా, రాజా ఎరువులను వాడండి!

ఎరువుల ప్రపంచములో సోనా, రాజా ఎరువులు
మిక్కిలి ప్రసిద్ధిగాంచినవి. వీటిని వాడి ధాన్యమును,
కూరగాయలు, పళ్ళు మొదలగు పంటలను అధికోత్పత్తిని
గాంచి అత్యధిక లాభములను సంపాదించండి!
సరియైన సమయంలో సరియైన మోతాదులు వాడండి!

**సోనా** ఎరువునందు కాల్షియం, అమ్మోనియం, నైట్రేటు,
మరియు 25% నత్రజని కలదు.

**రాజా** ఎరువునందు అమ్మోనియా సల్ఫేట్ కలదు.
ఇందులో 20.6% నత్రజని కలదు.

**సోనా** ఎరువు స్టీల్ అథారిటీ వారి అత్యాధునికమైన
రూర్కెలా కర్మాగారములో తయారు చేయబడుచున్నది.

**రాజా** ఎరువు రూర్కెలా, భిలాయి, దుర్గాపూర్ మరియు బొకారో
ఉక్కు కర్మాగారములలో తయారు చేయబడుచున్నది.

**సోనా** ఎరువు 50 కి.గ్రాముల గోనె సంచిలో లభ్యమగుచున్నది.

**రాజా** ఎరువు 50 కి.గ్రాములు మరియు 100 కి.గ్రా. ప్లాస్టిక్
సంచులలో లభ్యమగుచున్నది.



## స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్

(ఎరువుల విభాగము)

సెంట్రల్ మార్కెటింగ్ ఆర్గనైజేషన్, కలకత్తా.

రీజనల్ ఆఫీసు : సికింద్రాబాద్

ఏరియా ఆఫీసులు : సికింద్రాబాద్, విజయవాడ, విశాఖపట్టణం